# మున్నుడి

దాదా పిది పదునాఱేండ్లనాఁటి రచన. నాకప్పటికి సుమా రిరువదేండ్ల ప్రాయము. నా చదువుసంధ్యల కది సంధి కాలము. అంతక్రితమే "ఆకాయ పోకాయ" కవిత్వ మల్లఁ బ్రారంభించితిని. అదికారణముగా నిరంతరము కవితావృద్ధుల సాంగత్యమునకుఁ జొచ్చితిని. రానురా నదిబలీయమై పలువు రతోఁబాటు భాషాసేవకుఁ బురికొల్పినది.

ఈలోఁగడ నప్పుడప్పుడు పల్లెపదములు పరిష్కృతములుగా నల్లితిని. అందు భాషాభేషజ మించుక కొఱవడినను జానపదులుమాత్రము కడు ముద్దుసేయఁదొడఁగిరి. అంతఁ దనివోక క్రమక్రమముగా గురుకులావాసశిక్షకుఁ గడఁగితిని. తదాది కవితా జీవితములలోఁ బెక్కు-మార్పులు ఘటిల్లినవి. అభిరుచులు మెండైనకొద్ది తీరున కొక గ్రంథముగా వెలువరించితిని. అందులో నీ భాషాకావ్య మొకకోటికిఁ జెందినది.

నేఁ డిది నేలవిడిచిన సామనువారును లేకపోలేదు. కాని భాషాతీర్థముల కివి యాధారపథము లనక మాత్రము తప్పదు. అయిన నున్నవానిస్థితియే యిట్లుండ నుపరివానిగతి యేమను ప్రశ్న రాక తీరదు. నేఁ డిది దేశకాలపాత్రాదుల కించుక దవ్వైనను సృష్టిస్థితిగతు లెఱిఁగినవా రెవ్వరు నీ ధోరణికి దిగరనుకొందును. "భిన్నరుచి ర్హిలోకః".

నా ప్రవేశపరీక్షా సమయమున రామభద్రదీక్షిత విరచితమగు జానకీపరిణయము చదువుట తటస్థించినది. నా కందలి కథాకల్పన మచ్చెరువుగొల్పినది. మన కళాపూర్ణోదయముసైత మీ విషయమునఁ దీసికట్టనిపించినది. ఒక నా మాటయ కాదు, తజ్ఞులెల్ల రీ సమాధానమునకే రావలసి వచ్చును.

దానిని మాతృకగాఁ గైకొని యీ భాషాకావ్యరచన కుపక్రమించితిని. మక్కికిమక్కిగాక యందలి సన్నివేశములు మాత్రముటంకించి కావ్యధోరణి కనుగుణముగా నడిచితిని.

ఈ కళ్యాణరాఘవము మొత్త మైదుభాగములు. అందాద్య మీ సిద్ధాశ్రమము. తక్కిన పట్టభంగము, జనస్థానము, శుకరీనాటకము, పట్టాభిషేకము క్రమక్రమముగా వెలయింప సమకట్టితిమి.

నేఁ డన్నిటికిఁ గానికాలము. అందు ముద్రణ వ్యవసాయ మిట్టి దన వీలుపడదు. అగుట మా కీ విషయమున నెంతమాత్రము కాల్నిలువలేదు. అయినఁ జిన్ననాఁటికృషి యుబలాటపెట్టినది. ఇందులకు శ్రీ శ్యామసుందరప్రసాద్ చౌదరిగారి సహజౌదార్యము తోడ్పడినది. వారు దీనిని ముద్ర సేయుటే తరువాయి కడు మురిసిపోయితిని.

వారి లలితకళాభిమాన మపారము. ఇందుల కా యొముక లేనిచేయి, అమృతమొలుకువాయియే సాక్ష్యములు.

కృతు లిచ్చిపుచ్చుకొనుటయే మా ముఖ్యోద్దేశ్యము గాదు. మా యిరువాఁగులవారి కవినాభావసంబంధమైత్రి కొక చిహ్నము వలె ననిపించినది. అదియుఁ బలుమాఱు జ్ఞప్తి కెలయునదిగా నుండవలయును. దాని కింతకన్న సదు

పాయము వేఱొండు దోఁచలేదు. కాన నీ మూలమున నిర్వ్యా రము ధన్యుల మనుకొంటిమి. ఇట్లగుట మా కులస్వాముల మన్ననల కెక్కితినను మఱొక సంతోషము.

స్వర్గీయులగు బావగారిపైఁ దన కెంత ప్రీతియో!. యీ 'ద్వారా' తెల్లమగుచున్నది. లోకమునఁ గీర్తికాములు గానివారెవరు ? ఈ ప్రేమసుందరుఁడు దాని నన్యథాకరించి నాఁడు. ఇది దలంచుకొని నే నెంతయు ముగ్ధుఁడనైతిని. ఈ విషయమెల్ల సంకితములోఁ దడవితిని.

దీనికిఁ బ్రాతిపదికగా మొన్న మొన్న జాగర్లమూడి వారు కవితావసంతోత్సవము నెఱపి నా కఖండ సన్మాన మొనర్చిరి. అందుఁ బాల్గొని నన్నుఁ గన్నులఁ గప్పికొని గారవించిన శ్రీ పరుచూరి శివలింగయ్య చౌదరి ప్రభృతి ప్రాణమిత్రమండలికి నా కృతజ్ఞతావందనములు.

—గ్రంథకర్త



# కథాసూచన

## ప్రథమవీధి

జనకుఁడు, రావణుఁడును శివభక్తులు నందు మిత్రులును, ఆ చనవునంజేసి రావణుఁడు సౌందర్యవతియగు జానకిని తన కిమ్మని కోరెను. జనకుఁడు తప్పఁగ్రుంకలేక విశ్వామిత్రునితో నాలోచించి సకుటుంబముగా సిద్ధాశ్రమము చేరెను.

విశ్వామిత్రుఁ డటుపైఁ గ్రతురక్షణాపదేశమున రామలక్ష్మణులఁ దోడ్తెచ్చి తన యాశ్రమముననే వివాహమంగళము నిర్వర్తింప సంకల్పించి యయోధ్యకుఁ దరలెను

ఇంతకుముం దీపూజాదులఁ దీయుటకు రావణుఁడు శుకదైత్యు నంపెను. అతఁడిటువచ్చి యీ కుతంత్ర మామూలాగ్ర మెఱిఁగి తాటకాదులతో గుసగుసలాడి విశ్వామిత్రాదు లిటు రాకమున్న రామలక్ష్మణరూపములతో రావణాదు లరుదెంచి జానకిని జెట్టపట్టవలయు నను నాశతో లంక కేతెంచెను.

## ద్వితీయవీధి

రావణాదు లందులకై విమానారూఢులై వచ్చి సిద్ధాశ్రమభూము లందు విడిసియుందురు. ఇంతలో నాశ్రమవటు లిర్వు రట కేతెంచి జానకీవివాహాది విషయముల ముచ్చటించుకొందురు. ఇది కారణముగా రావణాదు లాశ్రమరహస్యము లెఱిఁగి కౌశికీతీరముం జేరుదురు.

## తృతీయవీధి

గాధేయుఁ డయోధ్యకేఁగువేళ సీతకు రాక్షసాంధంకరణ కంకణములు తొడిగిపోవును. ఆనాఁటివేకువ మైధిలికిఁ గలవచ్చి యందుఁ గనిపించిన రాముని సంస్థావిశేషమును లిఖించుటకుఁ గౌశికీతీరమున కరుగును.

ఈమె చెలికత్తెలు లేఖనసాధనములు దేర నాలసింతురు. అందుల కీమె కలవర మందుచుండ నంతకుముం దటనున్న రావణాదుల కీమె కానిపింపక మాటలే వినవచ్చుటంజేసి కడువింతగొల్పినది. ఇంతలో నామె చెలు లరుదెంచి రాముని రూపురేకలువ్రాయఁ బురికొల్పుదురు.

రావణాదు లాచిత్రపట మపహరించుటకు నామెరూప మరయుటకు సారణుని ప్రేరేచి బ్రాహ్మణరూపముతో నటకుఁ నడపుదురు.

అతఁడువారిని మభ్యపెట్టి కంకణాదుల నలవరించుకొనును. ఈలోన అత్రిమహర్షి జానకిని దీవింపవచ్చి జనకుని 'ద్వారా' ఆమెనటకు రప్పించుకొనును.

## చతుర్థవీధి

విశ్వామిత్రుఁడు దశరథకుటుంబమును దోడితెచ్చుచుండ మధ్యే మార్గమునఁ దాటకాదు లెదిరించి కొందఱు మడిసిరి.

అటుపిమ్మట లక్ష్మణుని బాణాహతిందూలి సముద్రమునంబడిన మారీచుఁడు కరాళునిచెవిగఱచి దశరథుఁడు విడిచిన రసాలవనముం దటియును. అపుడు రాముఁడొంటరిగా మృగయావినోదములం దేలుచుండ మాయావియగు కరాళుఁ డతని మిత్రుఁడగు పింగళరూపమున రామునిం డాసి తన సొద వెళ్లఁబోసికొనుచుండును. ఇంతలో మధ్యాహ్నమ్మగుటయు వారు సిద్ధాశ్రమ పరిసరములంజొచ్చి శ్రమ వాపికొనుచుందురు.

* * *

పూర్వజన్మ మేతపో భ్రష్టమైనదో
క్రొత్తవంశజలధి ముత్తెమయ్యె

* * *

అతఁడె బ్రతికియున్న నాంధ్రసరస్వతి
అమరకావ్యతీర్థ మాడకున్నె !

* * *

# ఉడుగర

చన వెంతో మన సంత కిబ్బడిగ మా
జాగర్లమూడి ప్రజల్
నను నామంత్రణసేసి దేశికవితా
నందాబ్ధి నోలాడి కొం
గున నూటాటులు గ్రుమ్మరించుతటి నా
కుం గూర్చు నెయ్యుండు నా
కనుల న్నిండిన శ్యామసుందరుఁ డిటుల్
కాంక్షించె నస్మత్కృతిః.

పిన్న బావ నవ్యపీయూషవర్షులై
చిన్ననాఁడ సుప్రసిద్ధులైరి
కావ్యసృష్టిలోన, గాంధర్వకళలోనఁ
గలము, కంఠ మమృత మొలుకఁబోసె.

పూర్వజన్మ మేతపోభ్రష్టమైనదో
క్రొత్తవంశజలధి ముత్తెమయ్యె
ఆ కళాతపస్వి యస్మదీయాగ్రజ
కధిపుఁ డయ్యె మాకు హర్ష మొదవె.

చివర కెవ్వఁడేని కవిమాత్రుఁ డైనచోఁ
గొంగులో వరాలు గురిసినాఁడు
మలప కేని లలితకళ గానిపించుచోఁ
బ్రమసి బ్రహ్మరథము పట్టినాఁడు.

ముగ్ధమోహనుండు ముప్పది నిండకే
కాలగర్భమందుఁ గన్నుమూసెఁ
గావ్యదేహ మిపుడు గన్పట్టుచున్నది
పాంచభౌతికమ్ము భస్మమైన.

అతని దివ్యకృతుల కాశాసదస్సులు
కలువరించుచున్న వెలయ లేదు
అతఁడె బ్రతికియున్న నాంధ్రసరస్వతి
అమరకావ్యతీర్థ మాడకున్నె.

అతని కలముజాడలం దెందఱెందఱో
దివ్యకవులు బయలుదేఱినారు
కవులె కాదు బుధులు, గాయకుల్, నటకులు
నాఁడు చుట్టుపట్ల నూడిపడిరి.

నన్నుఁ గన్నతండ్రి కన్నె నిచ్చి తరించె
అప్ప దుర్గ భార్యయై రహించె
ఏను కావ్యకన్య నిప్పించి మించెద
అమరకీర్తి జగ్గనాభిదునకు.

* * * *

ఆ మంగళమూర్తి వచ
శ్రీమాధురి కస్మదీయ చిత్తాబ్జములోఁ
బ్రేమమరందము జాల్కొన
ఆమోదించితిని తత్సభాంతరమందున్.

ధనికు ల్లేరన మాదినుండి తన తా
తల్ తండ్రులుం గూడ బా
ఢ్డున మాణిక్యముతో జనించి రిది నేఁ
డున్ మాకుఁ బ్రత్యక్ష మే
మని ప్రశ్నింతురొ ? వీని తండ్రి నియతుం
డై పుత్రకామేష్టి స
ల్పిన జన్మించినవాఁ డఁటన్న విని యు
ల్లేఖింతు రస్మాదృశుల్.

నాగరత్నాంబ నెఱపు పుణ్యమ్ము కతన
వెంకయాగ్రణి సంపత్తి వీనుమిగిలె
ఏల వారొన్నఁజాలు జంపాలవారు
మచ్చ లేనట్టి చందమామలు గదన్న !

స్తుత్య మగు నా ప్రశ స్తదాంపత్యఫలమె
సుగుణబంధురుఁ డీ శ్యామసుందరుండు
వలచి వలపించు నవ్వులచిలుక దొరకె
దివ్యసుందరి పద్మావతీకుమారి.

పతిమదిలోన దాను తన భావములోఁ బతియై నిరంతర
మ్మతిథి సపర్యలున్, గవి బుధార్చనలున్, రసచర్చలున్ శుభ
స్థితి గమనించుచుందురు సతీపతు లొండొరులున్ దయాళురై
వితరణలోలురై, మధురవృత్తసమాదరణైకశీలురై.

వీరి సాహిత్యసౌహిత్యధోరణులను
జగ్గనకవీంద్రు కవితాప్రసక్తిఁ దిగిచి
కంటఁ గడవెడు గా నశ్రుకణము లురలఁ
బరులు, బాంధవు లీక్రియ నొరలుచుండ్రు.

రాలినదోయి! తెల్గుజవరాలు ధరించిన పూవుటెత్తులో
మేలిగులాబిపుష్ప ముపమింపఁగరాని పరీమళంబు తా
తాత్కాలిక ఘోరమృత్యుముఖకశ్మలత న్విషమించి దిగ్దిగం
తాలకుఁ బ్రాఁకిపోయెఁ గవితావనితాఘనతావిఘాతమై.

ఎవ్వని కంటినీటి కెదురీఁదుటో ? మా నిజువేదగుండెలోఁ
బువ్వులమేడఁ గూలినది పుట్టెఁడుదుఃఖము ద్రింగికొంట కిం
కెవ్వని జూపి పోయె నితఁ డింతకు నూటికి నూఱు నిండె నీ
పువ్విలుకాని కాంధ్రధి కిఁకఁ బుట్టుగతుల్ మఱి లేవు గావలెన్.

అదె యస్తంగత లోకబాంధవుని ది
వ్యజ్యోతి కాశించు మా
హృదయంబెల్లఁ దమఃపరీత మయిపో
యెన్ నుయ్యొ యో ? గొయ్యొయో ?

కద ! మా కిందు వెలుఁగు దివ్వెలగతుల్
గల్పింపఁ గూర్చున్న దు
ర్మదుఁ డా దైవము పొట్టఁబెట్టుకొనె ని
ర్దాక్షిణ్యచిత్తంబునన్.

చిగురొత్తి నిల్వదా ? యుగయుగమ్ములదాఁక
మంజులకావ్యనిర్మాణశక్తి
గగ్గోలుగొల్పదా ? గగనసింధువుదాఁక
దిగ్విధు లొఱసి కీర్తిధ్వజంబు
వలగొని మ్రోఁగదా ! ప్రతి వత్సరముగూడ
స్మారకచిహ్నశంఖారవమ్ము
నివ్వాళి పట్టదా ? నిస్తులగాంధర్వ
మాధురీపులకితమారుతంబు
కతకుఁ గతమయ్యె నతనిజీవితచరిత్ర
మఱతుమన్న నొకించుక మఱపురాదు
మా మనస్స్యందనములందు మలయుచున్న
సౌమ్యమూర్తికి మంగళాశాసనములు.

* * * *

ఇట్టి కవీంద్రచంద్రునకు నీశ్వరసాక్షిగ మన్మనంబునన్
బట్టముగట్టినాఁడఁ గృతిబాలిక నాస్థ దొఱంగి చేతిలోఁ
బెట్టినవాఁడ జగ్గకవిపేరిట మత్కృతి ధన్య మంచు మిన్
ముట్టినవాఁడ నిట్లగుట మోదనిదానము కాదె యేరికిన్ ?

ఓ నటకాగ్రణీ ! నిను మహోజ్జ్వలకావ్యకళాస్రవంతిలో
స్నానములార్చెదఁ సుకవిచంద్రుఁడవో? నటరాజవో? భవత్
స్థానము దెల్పు మీ విపుడు స్వర్గములో సుఖముంటివా? కవీ
శానులఁ గంటివా! కవిత సాదనచేయుచునుంటివా ! ప్రభూ ?

నీకయి లోకము న్మఱచు నీరజగంధిని దుర్గమాంబ నీ
వే కరణిఁ ద్యజించితివో ! యిప్పటికిఁ భవ దంఘ్రిసేవ నో
త్సేకమునఁ, భవత్కృతవిశిష్టకృతిశ్రవణాతిరిక్తహే
వాకమునఁ భవ మ్మొకదివమ్మగఁ గాలముపుచ్చునిచ్చలుఁ.

దత్తుకొమార్తె నిచ్చి తన తండ్రికి నల్లుఁడవైన ని న్నిటుల్
గుత్తగొనె న్మఱంది తమ కోరిక కిబ్బడిగా భవత్కృతుల్
మొత్తముమామకిచ్చిఋణముఁగిణముఁ మొదలంటదీర్పుమీ
యెత్తు కదే పయెత్తు సుకవీశ్వరు లింత గ్రహింపకుందురే ?

మామకు మామవైన నిట మా కృతినిచ్చిన శ్యామసుందరుం
డేమి యొనర్చునో తెలియ నింద్రసభఁ కవిబ్రహ్మచెంగటఁ
గామక నత్తమామలకుఁ గావ్యసమర్పణసేయు మాతఁడే
భూములు,బుట్టలిచ్చితనుపుఁ మనుపుఁ దుదిఁదేలునన్నియుఁ.

నా కవితాకుమారి నిను నాధునిగా మన శ్యామసుందరుఁ
సాఁకినతండ్రిగా దశదిశల్ వెలయింపదె ? ప్రౌఢకావ్యముల్
చేకొనువారు, చక్కఁగ సృజించెడువా రరు దందు నిందు సు
శ్లోకులఁ బ్రస్తుతింతుఁ బరిశుద్ధ పదార్థ నిబద్ధ బుద్ధినై.

# సిద్ధాశ్రమము

## ప్రథమవీధి



మును పాఁ బ్రహ్మకుఁ గొమ్ము లూడ్చిన మహా
త్మున్ గాధిరాట్సూను నీ
వన మయ్యైఫలపుష్పతోయముల సం
భావించి సర్వర్తుశో
భనలాభం బెద నింపుకొన్నది తపో
భాగ్యంబు దాఁ బంచిపె
ట్టనిచో టిందొకఁడైన లేదు తదదృ
ష్టం బేమనం జెల్లునో ?

పలుమా ఱా మునిసార్వభౌముఁడు తపఃప్రభ్రష్టుఁడై మేనకా
జలజాక్షీమధురాధరోదితసుధాస్వాదక్రియాలోలుఁడై
కులగోత్రమ్ములు దక్కి తుట్టతుద కీ ఘోరాటవీవాటిలో
నిలుఁగట్టెన్ వెఱపుట్టి పాపము సురజ్యేష్ఠుండు ప్రార్థింపఁగన్.

ఏమని చెప్పికొందు మతిహీనుఁడు నిర్జరసార్వభౌముఁ డా
కాముకరాండ్రఁ ద్రోలి మన కౌశికు నెన్నివిధాల నేడ్చెనో?
కాముఁ డెఱుంగు నాతనికె గా దటువంటివసిష్ఠమౌని కీ
స్వామిని గామదేవునివశంవదుఁ జేయక నిద్రపట్టెనా? 3

ఆతని గోటిచెక్కడమునం దినవంశవిచిత్రవృత్తముల్
పూఁతల విజ్జి రాలినవి పుణ్యధనుల్ మిథిలాధినాథు లీ
చేతికి నందె వేసి రిఁకఁ జెప్పెడిదే మిరువీళ్ళు గాధిరా
ట్సూతికి రాచబాట లోకఁడుం దన సృష్టికి మారువల్కెనా?

వనవాసవ్రతదీక్షఁ గైకొని మనోవాంఛల్ విసర్జించి క
చ్చను బంధించిన మౌనిశేఖరుని సంసారంబు వేదాంతవా
సనతోఁ, క్షాత్రముతో వెలుంగుటమహాశ్చర్యంబుగాదందుమా!
తనవారల్ నిజకార్యఖడ్గపరతంత్రస్వాంతు లె ట్లయ్యెడున్. 5

అప్పటి రాక్షసప్రళయ మార్షచరిత్రము రూపుమాపఁగా
నిప్పులు గ్రక్కుచున్నఁ గమనించి మహోమహుఁ డస్త్రవిద్యలో
నప్పుడు పట్టభద్రు లగునట్టి తెఱంగు సమీక్షసేసి వా
రొప్పరికించినన్ నృపకులోచితవృత్తుల కుత్సహించెడున్. 6

అందును జంద్రవంశజు లహర్పతివంశజు లిద్ధరూపసం
క్రందననందనుల్ బలిసిరా నెవ రట్లటు లెంచి కార్ముక
స్యందనవాహనాదిగతు లార్థికశాస్త్రరహస్యవృత్తముల్
క్రందుగ నేర్పునాతనికిఁ గాఁ దలలూచె సమస్తలోకముల్ 7

అట్టియెడ నా సిద్ధాశ్రమమునయందు 8

మాకందశాఖపై మలయు కోయిలగంట
　　　　ముప్పొద్దు ముంగిళ్ల మొరయుచుండ
పర్ణశాలోపాంతబహిరంతరస్థలిన్
　　　　నిగమసౌరభ్యంబు నివ్వటిల్ల
కౌశికీగర్భశీకరవాతపోతముల్
　　　　భస్మాంగకములపైఁ బరిఢవిల్ల
శ్యామాకపరిపుష్టసారంగయూథముల్
　　　　బలివేదికలచుట్టు వాలయుచుండ

　　కెరలి గీతింప మురియు నుద్గీథవేత్త
　　లార్ష మర్యాద కలరు వేదాంతప్రియులు
　　స్నాతకులగోష్ఠిఁ దివురు నాషాఢధరులు
　　శాశ్వతబ్రహ్మజిజ్ఞాస సల్పుచుండ్రు. 9

పరివేత్తృసౌఖ్యసంపదకన్న కన్నీరు
　　　　వేదాంతగోష్ఠితో వియ్య మందు

అవకీర్ణికృతరహస్యాపచారభరమ్ము
అవభృథాకాంక్షతో నంత్య మెందు
ధర్మధ్వజీనిరంతరజీవికార్థమ్ము
సోమపానమ్ముతో సురుగు నెందు
నష్టాగ్నివిపరీతనటనావిలాసమ్ము
శ్రౌతాగ్నిదీక్షతో సమయు నెందు

మహిత కైవల్యసంధానమండపంబు
బ్రహ్మవిద్యోపబృంహితపార్థివంబు
నిత్యసామ్నాయ్యతర్పితనిర్జరంబు
పుణ్యసంభావితం బీ తపోవనంబు.

నులివెచ్చమండమ్ము జలకుండికలఁ దేర్చి
కాషాయములమైలఁ గడవఁబుచ్చి
ఇంగుదీతైలంబు పొంగార మేదించి
ఎడప్రొద్దు తలకు మంపెకట్టుఁదిగిచి
మలుసంజవడక యిమ్ముల కేఁగు నక్షాల
యూధస్యధారల నొడియఁ బిదికి
ఇష్టికర్మాపేక్షకింధనమ్ములు గూర్చి
దర్భాసనము లోలిఁ దట్టిపఱచి

క్రుంకు దాఁకాతిథేయమ్ము కొఱఁతవడక
అర్ఘ్యపాద్యప్రదానమ్ము లాచరించి

కుతుక మిబ్బడిగా బ్రహ్మగోష్ఠిఁదగిలి
ధర్మగేహిని మునిపత్ని తనియుచుండు. 11

తరుత ఫాలమ్మునందు మేధావిబొట్టు
పిల్లకూకటి మెఱుఁగారు పింజకట్టు
నెట్టుకొని బ్రహ్మవర్చస ముట్టిపడఁగ
ముంజికాఁ డధ్యయనదీక్ష మునిఁగి తేలు 12

ధర్మసూక్ష్మ మ్మెఱుంగు షట్కర్మపరులు
నుచిత గార్హస్థ్యబంధమ్ము లుజ్జగించి
గుహ్యమగు పరతత్త్వమ్ము గోరివచ్చి
కులపతియనుజ్ఞకై వేతు రెలమి మిగుల. 13

దృష్టి కందని దివ్యదిదృక్ష బెరసి
నిరత మానందముద్రావినిద్రులైన
ముక్తసంగుల కీ కందమూలములకు
గాఢమగుమైత్రి సేకూర్చె గాధిసుతుఁడు. 14

కర్మమూలకమైన జంగమజగత్తు
తీవ్రతరమౌ పరస్పరద్వేష ముడిగి
ఆర్షసంసారమర్యాద కగ్గమయ్యెఁ
బరమమౌని తపఃప్రభావం బదేమొ ! 15

మఱియు నందుం గల ద్వంద్వప్రవృత్తి సమానప్రతిపత్తిం బొలసి సకలజీవానందసంధాయకంబయ్యె. యోగిజన

హ్యాద్గమ్యం బగు పరబ్రహ్మంబు జ్యోతిర్మయంబై తపోవనంబు విభావనం బొనర్చె. హోమధూమంబులు గవనులం బవిత్రీకృతపవనులం గావించె. వషట్కృతంబులు విధివిహితవీతిహోత్రంబులును, సంతర్పితపురుహూతంబులును, వలయీకృత పురోహితంబులు నయ్యె. వేదాంతశ్రవణప్రవణు లగు యతివ్రతిప్రభృతిజనంబుల సమ్మర్దంబు దుర్దమంబయ్యె. అటులయ్యు నిఖిల విషయాధీశప్రేషితంబులుం గుమారజనోచితంబులు నగు మంగళద్రవ్యసంభారంబు లెడనెడ నింపువారును, లక్ష్యశుద్ధికిం దివురు క్షత్రియబ్రహ్మచారులను, అధ్యయన బుద్ధిం బెనంగు బ్రాహ్మణవటువుల ననధ్యయనశంకం దిగిచి తెచ్చువారును, కులపతి యోగదీక్షితుండుగాక మున్న పనివినియెదమని పలుచువారునై సమ్మర్దబహుళంబును, సన్నాహవిరళంబు నైన యజ్ఞవాటికం దఱిసి విదేహనృపాలుఁ డంపిన లేక న్నాకల్యంబుగఁ బఠించు విశ్వామిత్రుం డుత్క్షిప్తనేత్రుండై నియతవ్రతుం డగు సత్యవ్రతుని రేపకడ పయనంబని సనయంబుగ హెచ్చరించె నట్టియెడ 16

మాని సిద్ధాశ్రమోపాంతమార్గమందు
బండిగురివిందతీవచప్పరము లెనసి
చలువ లెగఁబోయు భూర్జవృక్షములపొంత
దైత్యుఁ డొకఁడుఁ డేమేమొ! తలఁచుచుండె. 17

పాదచారము సివమెత్తి బడలుపఱచె
అంకిళుల పొంకమూరించె నావులింత
తుమ్మ్మనకుఁ దమ్ముఁ డొకవేళ దొరకకున్న
ఆవులింతకు నన్నగా రవసరంబు. 18

ఇది నిమిత్తంబుగ నవ్వ్యాజనుండు నలువలంకులఁ దిలకింపం గొంతదవ్వునఁ దృణావర్తగర్తంబుల నృత్యంబొనర్చు వాత్యాచక్రం బభిముఖంబుగా ముసుంగు సవరించి భావి కార్యపర్యాలోచనతాత్పర్యంబునం గొండొకవడిం జను నెడ 19

దంతతాటంకసందానితోపలకాంతి
గండభాగంబుపైఁ గచ్చుదిగియ
గజచర్మచేలసంకలితోర్ధ్వకాయమ్ము
భిండివాలాగ్రమ్ముఁ బిడికిలింప
క్రమవరాటికాగ్రథితాస్థిమాలికల్
సందిదండలపజ్జఁ జౌకళింప
కటిసూత్రవిన్యస్తకరవాలబంధమ్ము
కోలెమ్ము జబ్బపైఁ గునిసియాడ

వక్రిమభ్రూవికారప్రవర్ధమాన
నిజమనోభావవిక్రియానిభృతబుద్ధి
చుక్క తెగిపడ్డ వడువున శుకుఁడు వ్రాలి
నారణా! వారెవా? యని చఱచె వెన్ను. 20

దానన గుండె గుబ్బుమని ధైర్యము పల్లటిలన్ మెడన్ దిర
శ్చీనముగానొనర్చి నినుఁ జీల్చిన వ్రేల్చినగాదు వెన్ను మ
న్నైనది దానవాధముఁడవా? బడవా యని భీతకృత్యమ్ము మై
నేనికతోలుపచ్చడము నేసి వెసన్ శుకదైత్యమోమునర్.

అంతట 22

కలవరపాటు దక్కి తగు కర్జముపై శుకుఁ డాడు సారణా!
చెలియలివాఁడ వంచుఁ గడుసేసితిఁగాని మఱొండుగాదు నా
బలపటమేమి సెప్ప మొగముం గిగముం జదువయ్యె వాదుకున్
స్థల మిదిగాదు గాకొకటి స్వామిహిత మ్మొడసేయు టొప్పునే!
అని తనకినుక మాన్పు శుకు నంటి చిరాకున వ్రేసినాఁడ నీ
మన మొకరీతిసేయు ననుమానము దక్కుము పోయినట్టి దా
పని మఱి కాయ? పండ? నినుఁబంచి ప్రభుం డెడసేసి తంచున
న్ననిచెఁ గృతార్థుఁడౌనె దనుజాధిపుఁ డాజనకాత్మజాదృతిన్.

అనవుడు శుకుండు నిరాశాసూచకంబుగ నిట్టూర్చి 25

ఏమని సెప్పువాఁడ మిథిలేశ్వరుఁడుం గుశికాత్మజుండు నే
మేమొ రహస్యముల్ సెఱిపి రింత కదృష్టము గూడిరావలెన్
గాముఁడు తామసింప నగు గాదను చెవ్వ రెటుల్ పెనంగినన్
గోమలి ప్రేమనూప కొడఁగూడునె స్వామి కభీప్సితార్థముల్.

అన్న సారణుఁ డీ యర్థ మట్టిదగునె
నీళ్ళు నమలెద వుట్టికిఁ ద్రాళ్ళు దెగినఁ

గుడిచి కూర్చున్న కోడలి కుతుక కేమి
ఎవరి దురదృష్టమున కెవ్వ రేడ్చువారు ? 27

ఈబిడ కెంత కొమ్ము గలదేమి త్రిలోకములాక్రమించి పెట్టునన్
గూబలుపిండి బందిఁగయికొన్న మనోహరదేవకన్యకల్
పైఁ బడుచున్న దిక్కును దిబాసియు లే దిఁక నీమె బైసియా?
ఈ బులిబుచ్చికంబు లవియేల ముఖాముఖిఁ దేలు నన్నియున్.

చెఱపట్టితెచ్చుచో నె
వ్వరు మాఱొక్కని నిల్వఁగలరు బలసూదనుఁడే
చెఱఁగొడ్డి శచీభిక్షము
తఱచుగ గ్రహించుచుండు దనుజాధిపుచే. 29

ఇంతకు మానవాధముల నెద్ది భజించిన దైత్యు లన్నచో
వంతుకు రా రెవారు శివభక్తిపరాయణులిర్వు రందు వే
దాంతులు దానఁజేసి వినయావనతుండయి రాక్షసేశ్వరుం
డెంతయుఁ బ్రీతిమై జనకు నేత్రెర మెచ్చిన మెచ్చునిచ్చులున్.

అదియునుంగాక జనకనంది నీ సందర్శనలాలసులును, జన
స్థాననివాసులును నగు పుణ్యజను లెడనెడనాడు పుడమి
పట్టి రూపగుణతారుణ్యలావణ్యవర్ణనాకర్ణనంబున వల
వని వలవంతకుందలమై 31

పారిజాతలతాంతపల్లవాస్తరణంబు
ఇంద్రునకుం గటాక్షించినాఁడు

మలయమారుత పరీమళ పట్టబంధంబు
ఋతురాజున కనుగ్రహించినాఁడు
చంద్రికావాఃపూర శైత్యోపచారంబు
రేరాజునకుఁ గుస్తరించినాఁడు
చందనగంధచర్చాచిద్విలాసమ్ము
పూములుకలకు ధారవోసినాఁడు
గాఢమోహాంధకారసంక్రమనిరస్త
శౌర్యగాంభీర్యధైర్యుఁడై సంభ్రమించి
జానకీపాణిపీడనోత్సాహరభస
మనిశ ముజ్జ్వాలలూప బిట్టడలినాఁడు. 32

అనుటయు శుకుం డందిపుచ్చుకొని 33

అగు నిది పోల దింక జనకాత్మజ రాక్షససార్వభౌమునిన్
దగులుట కల్ల సుందరుఁ డుదారుఁడు కోసలరాజనందనుం
డగు నను వార్త లెందు విననయ్యె విదేహనృపాలుఁ డింతకుం
దగిన వివాహసన్నహనతంత్రములం బచరించె వంచనన్.

అడియరితనంబుమై దనుజాధిపతియుఁ
జెప్పి పుత్తెంచునో ' యీక తప్పు నెడల
నెత్తివచ్చునో ! వీరమాహేశ్వరునకుఁ
దప్పఁ గ్రుంకినఁ గాల్పనే తనువు, మనువు. 35

మొక్కవోనిచెలిమి ముదిరిన శైవంబు
వంకపఱకపెట్టి వదలు పెట్లు!
దివ్యమలఁగకుండ దిద్దుకోవలె నంచుఁ
బనిచె నట్టి వార్త బ్రహ్మఋషికి. 36

జనకునింట శతానందజంతు వొండు
తేరకుం దేరమేసి యీతీరు నడిపె
బ్రహ్మఋషి పేర నిట వెల్గు పరమనీచు
గుట్టు బేడున మనకొంపఁ గూల్పఁదొడఁగె. 37

ఈ గాధేయుపంపునం గాదే! జనకపురోహితుండు సూర్య చంద్రవంశ్యులసంబంధంబుపట్ల శ్రద్ధాళువై క్షత్రబంధువు నాఁ జనువు మెఱపి కన్యాజనోచితంబుగ జగదేక ధన్వియుఁ దన్వీకుసుమధన్వియు నగు శ్రీరామచంద్రుని వందిచందంబున నభినందించుచు జనకనందిని డెందంబు నకు విందొనర్చె. తదాది సౌందర్యరతియు సాహిత్య భారతియు నగు సీత శ్రీరాముం బ్రేమించి సౌజన్యధన్యు లగు తదన్యరాజన్యపుత్రు లన్నం జిత్తంబు హత్తింప కుండు. జనకుండు నిద్దితద్దయు ముద్దుసేసి ప్రవర్తించువాఁ డెల్లి యజ్ఞసందర్శనాపదేశంబునఁ గౌశికాశ్రమంబుం బ్రవేశించు. ఇట గాధేయుండును సవనసంరక్షణ వ్యాజం బునఁ గ్రవ్యాదశిక్షణార్థంబు కళ్యాణవిచక్షణార్థం

బయోధ్య కేఁగి దశరథకుటుంబమ్ము దోడ్కొని
రాగలందు ఇవ్విశేషం బశేషంబుగ యక్షిణీప్రభావాను
భావంబున నెఱుంగఁగంటి ననవుడు 38

ఇంతయి వోము సారణున కెక్కడ లేని రుపాభరమ్ము నే
త్రాంతర మొలగింపఁ బరిహాసము మీసము దీర్ప నిట్లనున్
వంతుకువచ్చినన్ దనుజవల్లభుఁ డెంతకు లేఁడు కృత్రిమ
స్వాంతులుగాక యెందు ఋజుభావసమన్వితు లిట్లొనర్తురే?

ఎక్కడి వైభవంబు చదు రెక్కడ! యెక్కడి రూప మన్వయం
బెక్కడ! విక్రమస్ఫురణ మెక్కడ! కేకసిపుత్రకుం డనన్
దిక్కులు మ్రొక్కు నిర్జరులు తేజముదక్కుదు రీ మహామహుం
డెక్కడ? మానవేంద్రసుతుఁడెక్కడ నక్కడు నాగలోకమా!

రాచపోడుము లెఱుఁగని రాజఋషిని
మాయలకు మాయగఅపెడి మౌని దగిలి
పాప మా తల్లి లేని నిర్భాగ్యురాలి
పరమసౌభాగ్యసంపత్తు పదటఁ గలిపె. 41

అమరవందితదివ్యపాదారవిందుఁ
డల్లుఁడై మ్రొక్కులందు భాగ్యంబు దక్కి
అవకరమ్మున కీడ్చిన యనదవోలెఁ
బర్ణశాలకుఁ దా నెట్లు పయనమయ్యె? 42

పరమబ్రహ్మపదార్థంబు వడయఁగోరి
కష్టముష్టింపచుల కొడిగట్టనేల ?
పరముపదమున దిగిచిన బల్లిదుండు
బంధువై పొందరానట్టిపదవి గలదె ! 43

ఇటు మానవు లటు దానవు
లటునిటు నిటునటు పరస్పరాపృచ్ఛనలం
పటులై దూరీకృతసం
కటులై మనవచ్చు పెద్దకాలము నెమ్మిన్. 44

కానిమ్ము జనకుఁ డటకున్
దానై పఱతెంచు మాని తడయక చను నా
కైన తెఱం గాపై నగుఁ
దా నొండెన్ ధర్మ మొండె దైవ మెఱుంగున్. 45

ఇది తగునో ! తగదో ! మనపై
కొదవునె ? రాజాజ్ఞ దక్కి యూరక చనినన్
బ్రదుకఁటె ! ప్రభుపత్తమునన్
మొదలెత్తి వచింతు మూలముట్టుగఁ జనువుల్. 46

ఇట్లైన నెట్టకేని 47

ప్రభుని సంపత్సమృద్ధికిఁ బండ్లు పులిసి
బ్రహ్మవంశప్రదీప్తికిఁ బరవశించి

శౌర్యధైర్యప్రదీప్తికి సంతసించి
దనుజపతి కీక తక్కనే జనకవిభుఁడు 48

అనినఁ గంచుకంఠ మట్టిట్టు సవరించి
పుస్తమీసలోలి గుస్తరించి
కనుల నవ్వి పండ్లు గరగరలాడించి
చూపు లుచ్చిపోవ శుకుఁడు పలుక 49

మనమదిమాఱెగా కతఁడుమాత్రము పుత్రిని గా దనండు నా
విని క్షణ మాగి సారణుఁడు విహ్వలభావముమాన కిట్లనున్
జనకజ మూఢురాలు నిజసత్వవినిర్జితసర్వలోకునిన్
దనుజవరేణ్యుని న్విడిచి దాశరథి న్వరియించు టొప్పునే! 50

నయము భయంబు దోప నరనాథతనూజను దెచ్చి కూర్చుచే
నియతవ్రతంబు నా కనుడు నీ కిది దుర్ఘటమన్న నిర్వరుం
బయిపయినెత్తు లెత్తి యొక పద్ధతికిం దిగి రండు సారణుం
డయినవొకండు విన్మని రహస్యముఃఖుండయి వాని కిట్లనున్. 51

దనుజులు మాయలొడ్డి భుజదర్పవిజృంభణ ముల్లసిల్లఁగా
మనుజసురాహికన్యల నమాంతముగైకొని వచ్చుచుంట నీ
వును నొకకొంతెఱుంగు దిదెపో తగుమార్గము రామభూమికన్
దనుజకులాధినాయకుఁడు దాలిచి సీతను గైకొనందగున్. 52

కడచినవెనక దిద్దుకొని కాఁగల రం దసురేంద్రవైభవం
బెడఁదకుఁదెచ్చు సీత మిథిలేంద్రుఁడు తచ్ఛివభక్తిభావమున్

దడయక మెచ్చు నొడ్డు లిది ధర్మువు కా దన రీతఁ డన్నచో
నడలుగదా! త్రిలోకముల కాకుశికాత్మజుఁ డే మొనర్చెడున్?

కావున నీవు వైళంబ లంకకుం జని లంకేశ్వరుండు శ్రీరామ భూమికయుం దత్పూర్వ్వవర్తియగు విద్యుజ్జిహ్వుండు విశ్వామిత్రపాత్రంబును గామకఁ గైసేయు తెఱంగుచేసి సిద్ధాశ్రమంబునకుఁ దోడ్కొనిరావలయు. నాకుం బోలిన తెఱంగునఁ బ్రతినివృత్తు లగు గాధేయాదు లిటు కాలిడకమున్న మార్గమధ్యంబునఁ దాటకం బ్రేరేచి గీటడంగించెద. ఆపైఁ దక్కంగల విశేషంబు లరసికొంద మిం దీవు మసలక తోడ్కొనిరమ్ము పొమ్మని తఱిమి పలికిన 54

వా రెవ? సారణా! గడుసువాఁడవు ని న్నిఁక నీవపోలు దె
వ్వారికిఁ గాదు కౌశికుఁడు బ్రహ్మఋషిప్రవరుండ కాని సా
ధారణతాంత్రికుం డతనితంత్రము లింతకుఁ జాలవంచు వా
గ్ధోరణిఁ గార్యసిద్ధి కుసికొల్పుచు మెచ్చె శుకుండు సారణున్.

తదనంతరంబు 56

కల సిద్ధించినమాడ్కిఁ నక్కితమునన్ గళ్యాణమైనట్లై చం
కలు దాటించుచు దక్షిణాభిముఖుఁడై కాంతారమధ్యంబున
న్వేలలెంబో శుకదైత్యుఁ డాతని వచోవిన్యాసధన్యాత్ముఁడై
తలపంకించుచు సారణుండు చను దిగ్ధామంబు ధూమంబుగన్.

గళగర్తనిర్యద్వికారస్వరోదీర్ణ
కహకహార్భటి రటద్గహ్వరముగ
కాలాయసోత్తాలకాయకాంతిచ్ఛటా
లహరికోద్భూతవలాహకముగ
తామ్రకేశప్రభాధగధగాయితదిశా
భాగకృత్రిమదావపావకముగ
ఆలోలతారకాగోళనిర్భర్త్సిత
ప్రాంతచరద్గృధ్రభైరవముగ
ఘోరదంష్ట్రావిటంకవిఘూర్ణమాన
పరుషజిహ్వావలీఢకపాలదామ
తాటకానామ ప్రకటితధైర్యధామ
దైత్యకాంతాలలామ ప్రత్యక్షమయ్యె. 58

అంత డాసి మ్రొక్కి యంజలిబద్ధుఁడై
కుశలమడిగి గొంతుగూరుచుండి
సారణుండు గమనసందర్భ మడుగంగఁ
దాళు తాళు మనుచు దైత్యకాంత. 59

పాచిముడిచి తోలుపట్టదట్టి గూరి
దంతమాలపాయఁదట్టి విడిచి
ఖడ్గ మురక నుసిలి గంభీరముగఁ బల్కె
వికటభృకుటినటన ప్రకటితముగ. 60

పరశురాము నెఱుంగవో ప్రమధనాథ
భక్తితాత్పర్యచింతనాపరవశుండు
ప్రాణ మన వినవో మన ప్రభున కతఁడు
అవునవు నెఱుంగ కేమన్న నసురవనిత. 61

అతని తల్లికి మేనమామఁ టై తపించి
బ్రహ్మఋషిపట్ట మేమే మొ వడసెనంట
కపటకర్కోటకుం డైన గాధిసుతుఁడు
అతఁడఁటే యజ్ఞదీక్షితుం డైనవాఁడు. 62

జామదగ్న్యుఁ డతని సవనవిఘ్నక్రియా
ప్రవణదక్షులైన రాక్షసులను
మందలించుమంచు మఱిమఱి ప్రార్థింప
స్వామి నన్ను బంచెఁ జక్కఁబెట్ట. 63

మన్నిగొనఁడు గా కుమారమారీచుండు
చుట్టఁబెట్టియా యజూకవరుల
మన ముపేక్షచేసి మన్నింపకున్నచో
మాని కింక బ్రదుకు మార్గ మేది ? 64

నావుడు సారణుం డౌదుగఱచి 65

ఏమేమీ ! మన దైత్యశేఖరుఁడు ని న్నెట్లంపెనో ? వెఱ్ఱిదా
నా?మాయావిక దే? మునీంద్రుఁడు క్రతువ్యాజంబునన్ జానకీ

రామప్రేమవివాహమంగళము నిర్వర్తింపనున్నాఁడు నీ
కేమైన న్మదిలేదో? పంచిన ప్రభుం డేలా విచారింపఁడో? 66

అని పోనాడి సమస్తవృత్తము రహస్యాళంసువై విన్చినన్
గనుదోయిన్నెఱసంజ గీలుకొన హుంకారం బహంకారమున్
దనుకన్ దానవి చప్పరించుచు యథార్థంబన్న "నౌనన్న"వా
రిని దోరించెద మార్గమధ్యమున మారీచుండు తోడ్పాటుగన్.

అనుమానింపక పొమ్ము సత్వరమ దైత్యాధీశుఁడోడ్డెమ్ము మిం
చినఁ గార్యంబది తప్పుసుమ్మని శుభాశీర్వాద యౌ తాటకం
గని మారీచసుబాహులం గలిసి చక్రం బెట్టవమ్మా! జయం
బని త్రుళ్ళింతలువోవరాదు తుదకెట్లైయెట్లుమారొప్పెందునో?

అటువోరాదిటు లంచు సారణు డయోధ్యామార్గముంజూపియ
చ్చటువాసెన్ ఘనమార్గసంచరణదీక్షాదక్షురాలంత ను
త్కటరోషానలధూమధామమునుగ ధిఃకారంబు ఘోరంబుగా
మటుమాయమ్మయిపోయెమూఢులకుఁగర్ణంబిల్లిప్రేరేచెనున్

# సిద్ధాశ్రమము

## ద్వితీయ వీధి



వారిదపఙ్క్తులం గడచివచ్చు విమాన మమందమారుత
ప్రేరకమై నిరంతర చరిష్ణు కుబేరకుమార పుష్పక
స్ఫోరకమై నభశ్చరవిశుద్ధమనఃకలుషాంధకారవి
స్తారకమై సరాసరి నుదఙ్ముఖమై చను నంబరంబునన్. 1

అందు దినేంద్రతుల్యుఁ డసురాధిపుఁడున్ శుకసారణుల్ సుధా
స్యందిరహః ప్రసంగరుచిరార్థసమన్వయవాక్యవైభవా
నందితులై మనుష్యభువనస్థితవస్తువిలాసదర్శనా
నందరసప్రమత్తులయి నాకము గీకము మెచ్చ రిచ్చలన్. 2

బిల్లబీటయి పక్షి బిట్టులిక్క మూర్ఛిల్ల
నీటిమబ్బులచెమ్మ నివ్వటిల్ల
వ్యోమయానంబు లుద్దామగతిం దూలఁ
జిఱుగాలితరఁగల చికుక్కఁద్రీల
గ్రహకూట మొండొండ గ్రద్దరించుచు జారఁ
గలికి చుక్కలవెల్లు గాడివాఱ
హేమాబ్జమధుధార లిర్వంక లెగఁబ్రాక
ధ్రువమండలము పైఁడి దుమ్ముసోఁకఁ
దల్లక్రిందు ప్రయాణమై దైత్యవిభుఁడు
మున్ను విడిసినచోట్ల మార్పొన్నుకొనుచు
సహజవాచాలచారిమచాపలమున
నలువలంకులఁ దిలకించి నగుచుఁబలుకఁ 3

ఆ కన్పట్టెడు భూరిభూధరదరీవ్యాలోలనీలాంబుద
ప్రాకారాంతరవిద్యమానమణిదీపప్రాంతసంచారది
వ్యాకారంబులఁ బోల్పఁ దుద్యతకరవ్యావర్తమానేతర
స్త్రీకమ్మట్టులఁదోఁచుఁ జూచిరె సురస్త్రీలీవిమానోత్తమున్.

మందార ప్రసవస్రగగ్రకబరీమాధుర్యధుర్యాప్సరో
బృందమ్మెత్తిన భీతిఁబాఱెఁ గనుగొంటే సారణా ! మేఖలా
స్పందాదర్శితమధ్యముత్పతదురోజస్థానపైరమ్మ నా
క్రందాయాతపరస్పర మ్మసకృదగ్రవ్యగ్రపాదాగ్రమై. 5

మఱియు 6

అభ్రగంగాశీకరార్ద్రవస్త్రాంతర
సందష్టవీణాలం జంకఁజొనిపి
పద్మరాగప్రభాబర్హిపింఛావచూ
డోష్ణీషములుపజ్జ కుజ్జగించి
తరుణవీటీగంధదంతకాంతిచ్ఛటా
ధగధగ లెడసిపోఁ దమ్మునుమిసి
కర్ణావతంసితకనకాబ్జకల్హార
పరిమళాగతభృంగ పఙ్క్తిఁగసరి
యక్ష గంధర్వ సిద్ధ సాధ్యాది సురులు
తోయదాధారపథములఁ దొట్రుపడుచుఁ
గాళు లీఁచగ దిక్కు మొగంబులైరి
బ్రదుకుపై నాసచెడదుపో క్రతుభుజులకు. 7

దనుజస్కంధావారము
మును త్రిదివము దాడివెట్టి ముట్టినభంగిక్
మినువట్టి పరువులెత్తిరి
కనుగొమ్మన సారణుఁడు పకాపక నగియెన్. 8

అంత శుకుం డవ్విమానం బేటవాలుగాఁ బ్రకృతిస్థుండై 9

గవ్యూతిమాత్రంబ గగనాంగణము దోఁచు
దిక్చక్రమామధ్యఁ దీర్ఘమాడు

బయలెల్లఁ గ్రిందికిం బ్రవహించినట్లొప్పు
ఊర్ధ్వభాగము మింటి కొత్తగిల్లు
అభిముఖానిలతరంగాగ్రమ్ము లెద నాటు
అంభోధరములు చుట్టాక్రమించు
ఖచరాంగనలమేని కమ్మతావులు వల్చుఁ
జడలేటిగానమ్ము ముదముగొల్పు
పరివహస్థానసంచారపరిభవములు
క్రొత్తలే యను శకునిపలుకులకు నలరి
విపినగిరిపురసరిదబ్ధివిభవగర్భ
రత్నగర్భను గని పలుకు రావణుండు. 10

ఈ సాగరోర్మిక లిందుమౌళికిరీట
పాథస్తరంగవిభ్రమముగొల్పు
ఈ సరిత్సంతాన మిభదైత్యవిద్వేషి
భుజగేంద్రభూషణస్ఫూర్తిఁ దెల్పు
ఈ పురీవర్గమ్ము లీశాట్టహాససం
భవసుధారాశిసంపదలఁ బొదలు
ఈ భూధరశ్రేణు లీశ్వరోద్వేష్టిత
రుద్రాక్షమాలికారూఢి నెఱపు
ఈ మహావను లీశానుఁ డెద్దు తొల్చు
గంధగజచర్మవాసోవికాసమూను
ధరణిపై నిట్లు శివమూర్తి తాండవింప
నీశ్వరాంశము లేని దెందేనిఁ గలదె? 11

అనుచు మెఱపు మెఱయు టభ్రమ్ము మొరయుట
ఎడమదిక్కు గరుడి యెగసిచనుట
హెచ్చరించె శుకుని నిది యది యన కాతఁ
డన్యథాకరించి యధిపుమనసు 12

దేవా! ప్రసంగవశంబున విసరివైచినవడువునఁ బుడమి కవత రించితిమి. అల్లదే! కూఁతవ్రేటుదూరంబునఁ గాశికీ తీరంబు గలదు. తద్దక్షిణ దిగ్భాగంబునం గొంత మే రాక్రమించి విశ్వామిత్రు నాశ్రమంబు గన్పట్టు. తదంతి కంబునం దాశాంతవిశ్రాంతం బగు వటవిటపీపటలంబును, దానిం జుట్టి వేల్లత్పల్లవల్లీమతల్లీపల్లవోల్లసత్ ఝిల్లీనాద మేదురంబును, గుంజత్కుంజపుంజోపరంజితంబు నగు మం జులస్థలం బెంతయుం దలముకొని నెలవుకొనుట కనువు పడియుండు నదియునుంగాక 13

అపనయింపఁగరాదె? ఆయాసఖేదంబు
సురటిగాడ్పులు వీచు తరులనడుమ
తమిఁ గ్రోలఁగారాదె? తరితీపు మెఱయంగఁ
బుప్పొళ్లు విరిసిన పూవుఁదేనె
అవధరింపఁగరాదె? శ్రవణపేయమ్ముగా
శుకపికాలాపమంజులరుతమ్ము
సేవింపఁగారాదె? జిహ్వకించినమాడ్కి
బహువిధాపరిపక్వఫలరసంబు

పవ్వడింపఁగరాదె? లేపువ్వుసెజ్జ
అలఁదుకొనరాదె? మదయంతికార్ద్రరజము
మూరుకొనరాదె? సురభిళమారుతమ్ము
ఆరజముమీఁద నీకాననాంతరమున. 14

అదియునుం గాక 15

ఆశ్రమాంతికమున మాయ యచ్చుపడఁగ
నరయఁ జొప్పడు మీఁదు కార్యావసరము
ముదలయే యన స్వామికి ముదముగొల్పె
పారణుం డిద్ది లెస్సని సమ్మతింప. 16

వా రంతం డిగి రవ్విమాన మసకృద్వాల్లభ్యగర్వోన్నతిన్
నీరేజప్రభవాదిదైవతవరుల్ నిత్యంబు సేవింప స
త్కారంబుల్ గయికొన్న నే మనుజకాంతారత్నముం గోరి ని
స్సారమ్మా నర వేషమూనుట నికృష్టం బంచు భావించెదన్.

కాక చోరవృత్తి కడునింద్య మందుపై
నుగ్గపట్టి దోసిలొగ్గుటరిది
పొసఁగెనేని లెస్స పొరపొచ్చెమగునెడ
సర్వనాశనంబు సంఘటిల్లు. 18

అనుచుం దనుజేశ్వరుం డన్నున విన్నదనంబు గదురఁ బద
రుచుఁ గౌశికీతీరోపకంఠఘంటాపథంబున కిన్నాలు
బారల దూరంబునం దీరైన యారామ మఱుంగున విమా

నంబుఁ బెట్టించె. అంతం దత్సవిధరసాలసాలంబు క్రిందఁ బుప్పొడి కరుళ్లం బాయఁదట్టి శుకత్రోటీకోటీకుట్టనంబుల నుట్టిపడ్డ ఫలరసంబుల జిడ్డు వాపి తెలనాకు నేలం దలిరుటాకుల సెజ్జఘటించి శుకదైత్యుం డింద విజయం చేయుం డని ప్రభువరు నిభృతకరుండయి విన్నవించుటయు

చఱచి వెన్నెలఁగాయు చంద్రహాసప్రభల్
తలమునఁగా హస్తతలము నిగుడ
మొలక వజ్రాలపువ్వులతోపగుంఫిత
కంచుకదీధితుల్ ముంచుకొనఁగ
గండస్థలాభోగకాంతిపుంజములపైఁ
గోటీరమణిఘృణుల్ కొల్వుదీర్ప
చెంద్రిక పూవన్నె జిల్గుపుట్టమ్ముపై
ముత్యాలమొలనూలు మురువు గుఱియ
గాఢమోహాంధకార ముగ్రముగఁ బెరయ
దీర్ఘలోచనసందీప్తి దిశల మెఱయఁ
బల్లవాస్తరణంబుపైకల్లఁ జేరి
సారణుం జీరి పలుకె బృందారకారి. 20

జనకుం డాశ్రమ మేఁగుదెంచి నిజసంసారంబుతో బ్రహ్మగోష్ఠిని దాఁ బ్రొద్దులుపుచ్చుచున్నటులఁ దేల్చెం దాటకాసూతి కాదని వాదించితి రట్టి సన్నహానశూన్యం బాశ్రమస్థాన మింకనుగాధేయుఁడు రాఁడో కీమార్గమునఁ జక్కం బెట్టిరో సర్వముఖ

కానీ నా కెటు దోఁచకున్నది భుజాగర్వంబు దీపింప వీ
రైన న్మోసము వేస మే లని విపర్యాసంబున్నై పల్కిరున్
పౌనఃపున్యముగా వచింప శుకుఁడా పౌలస్త్య వీక్షించి స
న్మనోదాత్తనియుక్తయుక్తుల వచింపంజొచ్చె నిచ్ఛారతిన్.

మీకే నోడెద భృత్యభావమున స్వామీ! సర్వకార్యజ్ఞులై
ప్రాకామ్యం బగు నిష్టసిద్ధియెడ దుర్భావంబు వాటించినన్
లోక మ్మెక్కటిసేయు దూరజనమాలోడించు నీ గట్టివా
పోకల్ రిత్తకు రిత్తలై చనుఁ దుదిన్ బోకార్తు రుద్వర్తనుల్.

వశ్యులైనవారు వాల్లభ్య మాశింతు
రవసరమ్ము నెఱప రాప్తవరులు
తవిలిచూతు రహితు లవల నిందింతురు
బంధుజనము లిట్టి పట్టులందు. 24

అయినను 25

మిథిలాపతి శాంతిప్రియుఁ
డధికబలాన్వితుఁడు యుష్మదర్ధశరీరుం
డధిగత సకలైశ్వర్యుఁడు
విధివిహితాచారుఁ డతని వినిహతి తగునే? 26

ఆరామహతకుఁ డన్నన్
గూరిమివాటించు ముద్దుకూఁతును జనకుం
డే రీతి మాన్ప నేర్చును
గారవముం బ్రియము చనవు గల దామెయెడన్. 27

ఇట్టనుట దగునె ప్రభువరు
కట్టెదుట ననుజ్ఞ సేయఁ గాంక్షింతు శుకుం
డిట్టిది నానెఱుఁగం డని
పట్టిం బౌలస్త్యమ్రోలఁ బాణియుగంబున్. 28

అంతన్ దశాస్యుఁ డాతని
మంతనమున కలరి ముఖము మందాత్మభరా
క్రాంతంబయి శాంతుండయి
స్వాంత మ్మొకరీతిగాఁగ సస్మితుఁడయ్యెన్. 29

అది గని సారణుండు దనుజాధిప! నేఁ డివి క్రొత్తలౌనె మున్
త్రిదశవరేణ్యుఁడాది గల దిగ్వలయాధిపులున్ విదర్భ రా
జసుహితకై ప్రియంపడి దిశల్వలయం బరువెత్తి రెవ్వరిన్
జదివిన "ముక్క-చెక్క-లె" రసజ్ఞుల కివ్వనుభూతపూర్వముల్.

ఎట్లంటేని 31

చింతామణీరత్న సంతానసురధేను
లిల్లడవెట్టించె నింద్రుఁ డనరె ?
దివి పిక్క-టిల్లఁగా నవనిధుల్ వెటికించి
ప్రీతిమైఁ దెచ్చెఁ గుబేరుఁ డనరె ?
వార్ధిగర్భసముద్భవప్రసిద్ధపదార్థ
మరడలం గొనివచ్చె వరుణుఁ డనరె ?
శ్రీగంధపరిమళోత్సేకసంపద్రాశి
మూలముట్టుగఁ దెచ్చెఁ గాలుఁ డనరె ?

వారి దేవత్వ మెటు వోయె వలచుపట్ల
మానవుల్ దేవదానవుల్ మాఱుచుంద్రు
గొప్పగొప్పని తెగ రుంజుకొను టగాని
సురలు నరులును సత్క్రియాశూన్యు లధిప! 32

మీ రవశ్యము మైథిలిఁ బెండ్లియాడు
టుచిత మింతకుఁ జను తెంచి యుఁసుగుటేల?
నరులకుం గాలదోష మెన్న టికిఁ దీఱుఁ
గొంచి తగదని మీ రుపేక్షించు నెడల. 33

అనుచుం బ్రకృతావసరంబు నిరూపించుసమయంబున మొదల దశగ్రీవనియుక్తుం డగు విద్యుజ్జిహ్వుండు సాకేతమార్గంబు వట్టి తాటకం దఱిసి తనకుఁ బోలిన తెఱంగునఁ గార్యంబు చక్కఁబెట్టి వేవేగ సిద్ధాశ్రమంబున కేతేర వలయు ననియు నందనుక వివాహభారంబు నిల్చు ననియు ముట్టిపలికి యాా ననిపించుకొని వెంటనే మింటిచక్కన్ దశకంఠుఁ డున్న వనంబు సొచ్చి వీ రాడుకొను నీగడంబట్టి దఱియ నేతెంచువాఁ డప్పటి యుపచారవచనరచనా సంక్షుభితచిత్తవృత్తియై అగు నిది భాగధేయంబు కాక యొం డగునె? బృందారకబృందంబునకు వరాటభూభృన్నందనయుంబలె జనకనందినియుఁ గేకసీనందనునకు దుర్లభ గాదుగదా యని బలుమొగంబై యల్లన పొడసూపిన 34

ఓహో యనెఁ బౌలస్త్యుం
డాహా యనె సారణుండు నాశ్చర్యభర
వ్యాహార మెనయ శుకుఁ డు
ద్బాహుండై కార్యమడుగఁ బదపడి యతఁడున్. 35

అన్నీచులకై మిన్నుక
మన్నుం గలపంగ మార్గమధ్యమునం గూ
ర్చున్నది వచ్చుటె తడవా
యన్నలు తొలికబళమగుదు రన్నది కినుకన్. 36

ఆకు దిరుగఁజదివినట్టి దురాత్ముండు
కౌశికుండు కన్ను గప్పఁగలఁడు
కట్టుదిట్టమైనకడ కేర్పరించితిఁ
జక్కఁబెట్టనేమొ? సర్వ మింక. 37

కర్జ మెఱిఁగి సేఁత కడముట్టుయత్నమ్ము
ఉరక నీరు నములు టొప్పు దెందు
రండు మాయఁదగిలి రవరవ మెఱయుంత
మసలు గాధ దేలునంతదనుక. 38

అయిన నీ ప్రభుచిత్త మెత్తెఱంగున వాటంబైయుంను నద్దాని
కనుగుణం బగు సేఁత యుచితం బను నవసరంబున. 39

గాదిలి బ్రహ్మచర్య మొడికమ్మగు కమ్మని బ్రహ్మవర్చస
మ్మెదఁగఁ గావివల్లె మెఱయించెదు జన్నిద మక్షమాలతో

నీడఁగఁ బిల్లకూఁకటి పయిం బడి ముచ్చెనగుంట సోయగ
మ్మాదఁగ ముంజికాండ్రిరువు రచ్చట చేరిరి ముచ్చటాడుచున్.

ఆ పొద నీ పొద నా పూ
వీ పూవుం జిదిమి పరువులెత్తుచు నా పం
డీ పండు డుల్చి చిదుగులు
మోపెఁడు ద్రుంచిరి నితాంత ముదమెదఁ బొదలన్.

శుకుఁ డంతఁ బోల్చుకొని యిం
దొకఁడు శతానందశిష్యుఁ డొకఁ డీ బ్రహ్మ
ర్షికి నంతేవాసి యిఁకన్
సకల మ్మెఱుఁగుదుము వీరి సల్లాపములన్. 42

అనఁ జెట్టుకొకరుఁడై మన
మనయు మ్ముఱ్ఱాఁతలూఁగ నాపొంతన వా
రిని గన్నొఱంగి నిల్చిరి
దనుజాగ్రేసరుని దొట్టి దైత్యప్రముఖుల్. 43

అంత నవ్వటువులిర్వు రోపిన తెఱంగున నప్ఫలపుష్పాదుల విభ
జించుకొని యొక్కింత విశ్రాంతికై పూలకమ్ములం జేరగిలి
కుశాదానపరిక్షతాంగుళు లొండొరులకుం జూపుకొనుచుం
గంటకానువిద్ధంబులగుచరణంబులు వ్రణంబులుగాఁ జోపు
కొనుచు హాహాకారవికారస్వరోదీర్ణవర్ణాలంకృతంబులగు
వదనంబులు పొదలం గొండొకవడికిం దేటి ప్రసంగవశం

బున్న మిథిలాధినాథుం డిదం ప్రథమంబ కూఁతుతో నేకతం
బే తెంచువాఁడు వివాహమంగళారంభసంరంభం బుడిగి
తడయు నెటు దప్పివచ్చునో యను సత్యవ్రతునకు దేవ
వ్రతుండు 44

ఇంత తడయుట కేమి మహీశ్వరుండు
నేఁడ పో వత్తు నని చనెఁ గూడముట్టి
చనకిరో ? దుర్మతులు కాని జనకవిభుఁడు
గుండె నీఱయి లోలోనఁ గుమిలిపోవు. 45

కులపతి యజ్ఞదీక్ష గయికొన్న వివాహసహాయ మస్మదా
దుల కగు భూరివైభవముతోఁ దలముసకొగ మావిదేహకున్
వెలలెద మీవునుం గదలవే మిథిలాపురిచూడఁ గన్నులా?
ఇల కది స్వర్గఖండ మొకఁ డేమిటి చెప్పిన దీఱ దెంతయున్.

తరుణేందూపలకుట్టిమంబులు జలాధారంబులున్ గేలికా
సరసుల్ సౌధము లంచితోపవనముల్ సాహిత్యశిల్పమ్ములోఁ
దఱచెట్లో గ్రహియింపకుందురె కళాతాత్పర్యచింతాజడుల్
పరమామ్నాయశిఖారహస్యపదవీప్రాగ్భారపాథోనిధుల్. 47

అన సత్యవ్రతుఁడు చివు
కకను మన మొకరీతిగాఁగ ననుఁ గనుగవ నె
కొకను వింతచూడ్కి కబ్బుర
మొనయం గ్రొవ్వాడి తలఁపు లెలుఁగుం దగులన్. 48

ఈ కందమూలభోజన
మీ కౌశికీ సలిలపాన మీ కాంతారో
త్సేకపవమానసేవన
మే కరణి లభించు నవ్వనేమనభిజ్ఞుల్. 49

ప్రాతర్వేళల జిల్గుమంచుతెరపర్వన్ మందమందానిల
వ్రాతమ్మొయ్యన నేఁగుదేరఁ దరుణార్కస్వామి బంగారపుం
జేతుల్స్నాపముసుంగుఁద్రోఁచువనలక్ష్మిం జూచియుప్పొంగుమా
చేతఃప్రీతికి నన్యమించునె భవత్సిద్ధాంత మింతేకదా ? 50

నగశృంగాగ్రపయోదమాలికలు మింటం గామరూపంబులై
దిగి మా యాశ్రమహోమధూమబహుళాతిథ్యంబుగై సేసి పె
న్నగముల్ నాఁజను వేళఁ బ్రత్యహముసంధ్యాలక్ష్మి చిత్రించు నీ
భృగుమార్గాంతరవర్ణచిత్రముల మీ రెందేని వీక్షింతురా!

మాలతీ మాధవుల విభ్రమముల కలరి
తలరు నిర్ఝరణీ ప్రపాతముల కుబ్బి
ననుపు శుకపికమధురగానములఁ దనిసి
ప్రకృతిపాఠమ్ము గఱతుము ప్రత్యహమ్ము. 52

సకలభోగపరాయణాశ్రమమునందుఁ
గ్రమముగాను త్రివర్గమ్ము గడపిపుచ్చి
మోక్షసాధనకైన ముముక్షువుల క
రణ్యవాసమె తుదకు శరణ్యమన్న ! 53

మఱియు 54

అనయ మెసకొనుఁ బట్టణాభ్యాసములకుఁ
బరమసుఖ మబ్బు నాశ్రమాభ్యాసములకు
శమదమజ్ఞానవైరాగ్య సంపదలకు
ఆశ్రయంబులుగావె ? పుణ్యాశ్రమములు. 55

నావుడు దేవవ్రతుండు 56

ఔగా కుల్లియ మల్లియ
బాగోగులు చదువనేర్చె వైరాగికి స్వ
ర్భోగమ్ము లేల నీ తల
వేఁగెనె కొసవెట్టి తబిసి వెన్నుంగాయున్. 57

రమణీయపుష్పితారామసీమామోద
కామోత్సవారంభకలకలములు
బహురత్నకీలితాభ్రంకషప్రాసాద
వీధికావేదికావిలసనములు
వివిధదేశాయాతవిశ్వంభరాధీశ
కోటీరమణిఘృణిగుంఫనములు
సాంద్రవిద్యుత్ప్రభాసారధారాపూర
సుస్నాతవర్తనీశోభనములు
నృత్తగీతకళాసమున్మీలనములు
చిత్రచతురంగబలసముజ్జృంభణములు

వప్రపరిఖోన్నతగభీరవైభవములు
తజ్ఞులకుఁగాక నచ్చునే త్వాదృశులకు. 58

ఇట్టి 59

అనుపమభోగభాగ్యమహిమాస్పదపత్తన మేడ! శుష్క-భో
జన కఠినవ్రతస్థిరవిచారపరీతనికృష్టవన్యజీ
వన మదియేడ! వాదప్రతివాదబలాబలనిర్ణయక్రియా
వినిమయవిప్రలాపములు విశ్వసనీయములౌనె? పుణ్యుఁడా!

అయినను 61

మన మిటు ద్రవ్వనేల? సుఖమజ్జనభోజనపానలేపనా
ద్యనితరదుర్లభక్రియలకైన జనంబు లరణ్యవాసనం
జనితనితాంతకష్ట మెటు సైతు రకృత్రిమజీవనక్రియా
వినిహతి కెట్టు లోర్తురు వివిక్తపదాభినివిష్టమానసుల్. 62

అనుచుం గనుబ్రేయ నుంకించి జంకి 63

మాట సత్యవ్రతా! చంద్రమౌళిసాక్షి
ఇట మహత్త్వము దెలియ నే నెంతవాఁడ
మోక్షసామ్రాజ్యలక్ష్మీ ప్రమోదనృత్య
మహితరంగస్థలము లాశ్రమస్థలములు. 64

అనుడు సత్యవ్రతుం డోసరించి ఓయయ్యా! ఎత్తువారిచేతిబిడ్డం
బై ట్లాడినం జెల్లు ఎల్లి మా యదృష్టం బేమన నీకతంబున

నగరవాసనావిశేషంబు లనుభవింప నోచుకొందుమని
సూక్ష్మగతిం బోనాడిన దేవవ్రతుం డన్యాలాపశంకం దిగిచి
సఖా! మిథిలేశ్వరుం డిం కెన్నటికి స్వదేశాభిముఖుండగు

ఈ యచలరమ్యసానురోరూయమాణ
సరిదభంగతరంగశీకరరసార్ద్రి
శిశిరపవమానకందళాశ్లేషమహిమ
పట్టిపల్లార్చుఁ బెను శిరోభార మెపుడు. 66

ఎట్లనను 67

తా నరిగినట్టి కార్యసన్నద్ధహృదయుఁ
డర్క కులదీపకుం డెచ్చునట్టి పిదప
సత్ర మొనరించి యవభృదస్నానవిధుల
నెఱపినందాఁకఁ జనని చ్చునే మహర్షి. 68

అధ్వరధ్వంససన్నద్ధు లతిబలాఢ్యు
లుగ్రకర్మపరుల్ దైత్యు లుప్పరింప
గాధిసుతుఁ డెట్లు యజ్ఞదీక్షకుఁ గడంగు
ననుడు మోమింత గాఁగ సత్యవ్రతుండు. 69

పట్టుదలం ద్రిశంకునరపాలున కొండొక స్వర్గసృష్టి చే
పట్టిన దేవతల్దలకి బ్రహ్మకడ న్మొఱవెట్ట నాతఁడున్
దొట్టిన భీతిఁబాఱి తన దుస్థితి దెల్పి కరంబు వట్టినన్
నెట్టన సమ్మతించు గురునిన్ దనుజుల్ చలపట్టి గెల్తురా? 70

కాకున్న శునశ్శేపునిఁ
జేకొనునఁటె క్రతుఫలంబు సిద్ధించునఁటే
ఆ కారుణికోత్తమునకు
లోకువగానట్టి సిద్ధలోకము గలదే ? 71

ఇంతకు నేర్చు కౌశికమునీంద్రుఁడు పఙ్క్తిరథావనీశ శు
ద్ధాంతజనమ్ము దెచ్చి క్రతుధర్మపరిగ్రహణంబొనర్ప ని
శ్చింత నయోధ్య కేఁగె నిది స్నిగ్ధజనప్రణయప్రవృత్తిగా
కంతటి మానిచంద్రమున కా ప్రకృతిప్రణయానుబంధముల్.

తప్పక వత్తు రాదశరథక్షితిపాలతనూజు లన్నిటన్
గొప్పకు గొప్పలై నృపతికోటులఁ గోటికిఁ గోటిసేయు న
య్యొప్పులకుప్పలందు సుగుణోత్తరుఁ డా రఘురామచంద్రుఁడిం
కెప్పటి కేఁగుదెంచి తనియించునొ? యాశ్రమవాసులందఱన్.

అన దేవవ్రతుఁ డిట్లు పల్కె శివభక్తాగ్రేసరుం బఙ్క్తికం
ఠుని కన్బ్రామి రఘూత్తముం దగులు పెట్టున్ ముప్పవాటిల్లు న
ద్దనుజాధీశ్వరుఁ డిద్ధతేజుఁడు భుజాదర్పంబు దీపింప ని
ల్చిన ముల్లోకము లడ్డునే? బలిమిమైఁ జేపట్టినన్ దిక్కఁటే. 74

ఏ లేల దూరమఱచితి
నాలావరి పోటుతనము నావాలి భుజా
మూల మ్మొఱుంగు నూరక
యాళిగ గుమ్మడి వివాద మెందుల కిచటన్. 75

నావుడు నీవన్నది స
ద్భావంబునఁ గా దొకప్పుడు బలవంతుండున్
జేవ చెడు ననద నెగ్గును
దేవత లేలినదె పూర్వదేవుం డేలున్. 76

అనుడు నమ్మాటకేమి యోయయ్య! వీఁడు
నర్మదానది నోలాడు కర్మవీరు
కార్తవీర్యార్జునుని కారఁ గట్టువడియుఁ
పిల్లివట్టిన యీరువై తల్లడిలఁడె? 77

నాఁగ నాగాయుతబలుండు నరకమెత్తి
శ్రాద్ధదేవుని పటుదేహశుద్ధి నెఱపి
నరకజీవుల యమయాతనలను మాన్పఁ
గాక రజతాద్రి నెత్తిన గాథ వినవె! 78

వినకపోనేల యప్పుణ్యజనవరేణ్యు
గాటఁ గట్టిన గుట్టమై కలువరింతు
వింటఁ దిని యింటివాసము లెన్ను మచ్చుఁ
జెంగనాడిన నాలుక చేదువాడము. 79

అనుచు నవ్వటుధూర్తు లిర్వురు స్వభావచాపలంబున నొం
డొరుం గడవనాడికొని వ్యర్థవాకలహసంక్షుభితచిత్త
వృత్తులై కాలాతిక్రమణంబున కోర్వక ఫలపుష్పాదు
లొడిచిపుచ్చుకొని యిచ్చమై నచ్చలంబున వెచ్చవాఱుచు

నుటజాభిముఖులై నిర్గమించిరి. వారి దూషణభూషణ
సంభాషణంబు లాద్యంతంబు లదృశ్యులై మిన్నక విన్న
దశగ్రీవాదు లమర్షావేశంబు లొక్కుమ్మడిం గ్రమ్మ భావి
కార్యతాత్పర్యచింతాస్వాంతంబు లలవరించుకొని పలు
విధంబుల గాథేయాదులఁ దూలనాడు నెడ సారణుండు.

మచ్చరమేచి ధూర్తుఁ డవమానముగాఁ బ్రభు నాడువేళ నా
యచ్చల మూఁగకున్న నపుడప్పుడె యవ్వటు పచ్చిగుండియల్
వ్రచ్చెడివాఁడ నిందనుక వచ్చునె; చిచ్చొడిగట్టి గాలితో
ముచ్చటలాడ నేర్చు మునిముచ్చులనోరికిఁ గళ్లె ముండునా?

కట్టడి గాధిసూనుఁ డొక గౌరవనీయుఁడె కామధేనువున్
బట్టిననాఁడ యత్తబిసి బైసియు బైటఁబడెన్ వసిష్ఠుచేఁ
దిట్టులఁ బోయి యచ్చరల తిప్పులకుం గుటిలైన తత్కథల్
గొట్టిన పిండిగాదె? చెడుగుల్ పిడివాదమొనర్తు రెల్లెడన్.

కొంపకు నిప్పువెట్టి మన కూటము కూఁకటివ్రేళ్ళతోడ లా
గింపఁ బ్రయత్నపడ్డ ముని కీళ్ళెడలించి వటూత్కరంబులన్
అంపపుఁగోఁతగా గరగరఁ గడికండలొనర్చి ప్రేవులన్
ద్రెంపిననాఁడుగాని కసిదీరదు మత్కరవాలధారలన్. 83

అదియునుంగాక 84

వాడిమగండఁట జనకవల్లభుఁ డమ్ముని జోడుకోఁడెయై
సూడున కెత్తివచ్చినను జోగియు జోగియు రాచుకొన్నచో

బూడిద రాలు నిం దొకటి పుట్టిన గంపెడు చిమ్మచీఁకటిన్
మాడున కంటి పంపు ననుమానము లేదని గుర్తెఱుంగఁడో?

అనుటయు విద్యుజ్జిహ్వుండు 86

కొందలమెందు కా కుసుమకోమలిచిత్త మెఱింగి కా శతా
నందుఁడు కౌశికుండు నరనాథుఁడు చంకలువైచుచుండి రా
సుందరి రాక్షసేంద్రుఁ డొకచోఁ దమ రూపవిలాససంపదా
నందమువొందినన్ మరుఁ డనంతరకార్యము నిర్వహించెడున్.

వా చవిదప్పి యిద్దనుజ వల్లభు నాడిన దుర్విదగ్ధునిఁ
బీచ మడంతు మ గ్గురిని పెద్దతనం బడె మార్గమధ్య మా
రీచుఁడు తేల్చిరాఁగలఁ డరిందము విక్రమమెల్లఁ జాటి య
న్నీచుని దమ్మలూడ్చెగమనింతె ద్వితీయుఁ డసాధ్యుఁ డింతకున్.

ఇందు విదేహభూధవున కెక్కలుసెప్పి దినేశవంశరా
జ్ఞాందనునంద జానకిమనమ్ములగించిన దుర్మదుఁ శతా
నందునిముందు బందెగొనినం గుశికాత్మజుఁ డిందు రాక ముం
దొందు శుభమ్ము లందనుకనోపినఁ జొప్పడునే ప్రయత్నముల్.

నావుడు రాక్షసేశ్వరుఁడు నా కిది వోలినమార్గ మిందు భూ
దేవకుమారుఁ డెంతయు నుతించిన పఙ్క్తిరథాత్మజుల్ ప్రతా
పావధులా! తదాశ్రయమహాత్వవిలాసవచోవిశేషసం
భావనులా! గుణాగుణవిమర్శన కొల్లరు బ్రహ్మబంధువుల్.

మాయారాముఁడనై సదు
పాయమ్మునఁ జెట్టఁబట్టవలనో ? వెడఁగో ?
ధీయుక్తి మెఱయ నందం
బాయకరం బెవ్వఁ డెఱుఁగు భవితవ్యంబుల్. 91

అని యుడ్డాడుచుఁ గౌశికీభువనఝంపాకంపమానప్రకం
పనసంపాతము లుల్లసిల్లఁ బ్రవహాన్మారందధారానిమ
జ్జనకేలీమిళదాలిగానలహరీఝంకారము ల్మిఱ నం
దనసందోహవిడంబనం బయిన కాంతారప్రదేశంబునన్. 92

ఇంబడరుమాని సిద్ధాశ్రమంబు దఱిసి
తరుణసహకారవృక్షసంతతులమధ్య
జటిలలవలీనికుంజపుంజములనీడ
సహచరులు దాను నడయాడసాగి రెలమి. 93

# సిద్ధాశ్రమము

## తృతీయ వీథి



చలిచెమ్మల్ చిగురాకుగంట్లఁ బొడమెన్ జాల్వొన్న లేమంచు పా
యలలోఁ దుమ్మెద ఱెక్కలార్చెఁ బసిపూ లల్లాడిపోయెన్ జివు
ళ్లొలికెన్ బల్చనికావిరంగు లటుపై నొక్కుమ్మడిన్ ముమ్మడిన్
వెలికాంతుల్ తొలికొండ పైకి వెడలెన్ దిగ్జైత్రయాత్రార్థమై.

అత్తఱి జానకీహృదయ మంటెనఁ గందు మనోహరుండు క
న్నెత్తఁగ మాయమయ్యె మెఱయించిన చెయ్వులలోఁగవింతగా
హత్తిన దూరమయ్యె బయ లారసి రిత్తకు రిత్తయైన ద
చ్చిత్తము స్వప్నవృత్తము నశించుటకాఁ దలపోసి వేసరెన్.

అంతకుమున్న ప్రాణసఖు లాడిన రాముని రూపరేఖలా
ద్యంతము లచ్చుగ్రుద్దినటు లక్కలనిక్కలమైనవానియం
దంతయుఁ బోల్చిపోల్చిహృదయమ్మదయమ్మయివ్రేపశాంతమూ
సాంతము దూలఁ దద్గతవిచార మపారముగాఁ బ్రవర్తిలెన్. 3

తీయనిపోడుము ల్మదికిఁ దెచ్చి కరంగు నభీష్టసిద్ధికిన్
దీయని వింటివానికిఁ బదింబది మ్రొక్కుఁ దదీయయౌవన
చ్ఛాయల లీనమొందు మనసారఁగఁ దత్ప్రణయప్రపంచమం
దూయలఁలూఁగు దాశరథి నొయ్యన భావనసేయువేళలన్. 4

అట్టి సమయంబున 5

స్వప్నగతంబైన ఛాయావిలాసమ్ము
భావనాశక్తిలోఁ బదిలపఱచి
కనువ్రేయ జంకుమెత్తని వాలుచూపులు
రూపపిపాసలో రూఢిపఱచి
తలఁపుతోడఁ జిగిర్చి వెలిబర్వ కాయ్వులు
మందస్మితమ్ములో మఱుఁగుపఱచి
సిగ్గుతెరం జీల్చి చిత్తగించిన నుడుల్
జిహ్వాగ్రమునయందుఁ జిక్కపఱచి
గడుసుపోకల విజ్జోడుపడెడువేళఁ
బాప మభ్యర్థనాభంగభయము దొడరి
విడిచిపుచ్చిన చెలువుని వేడుకలకు
మైథిలికిఁ గొంత సంతృప్తిమాత్ర మొదవె. 6

మఱియు 7

తొంగరువాతెరసందు దోబూచు లాడెడు
కలికినవ్వులఁ జిందు కమ్మదనము
చిగురుచెక్కులఁదొట్టి జిగివెల్లిగొల్పెడు
సొగసుచూపుల నూరు సోయగమ్ము
నిద్దంపుబలురేఖ నిండారఁ బ్రవహించు
నీలినీడలఁ గులుకు నిబ్బరంబు
కడుదిట్టతన ముట్టిపడువాలకమునందు
చుఱుకుపా లెగఁబోయు గఱువతనము
పెదవు లొాదిగించి క్రీఁగంటి తుదలముంచి
నిదురమబ్బెసగించి నెమ్మదిగరంచి
దుందుడుకు వెట్ట సీతావధూటి నాఁటి
స్వప్నచిత్రము మది కెక్కె సంభ్రమమున. 8

భ్రూపీఠనిహితోర్ధ్వపుండ్రశృంగారంబు
మణికుండలప్రభామంజిమమ్ము
పరిమితశ్రీకాకపక్షసౌందర్యంబు
గ్రైవేయమాలికాకల్పనంబు
గుణకిణాంకిత భుజా కోదండగరిమంబు
గూఢజత్రుక్లిష్టగుంఫనంబు
ఘనఘనాఘనకాయకాంతిమాధుర్యంబు
కనకకాంచీదామగ్రంథనంబు

భావఫలకంబునం దచ్చుపడినమాడ్కి
ననితరానందసౌఖ్యసంప్రాప్తి గోరి
ప్రియునిరూపంబు విలిఖింపఁ బెద్దతడవు
చింతచేయుచుఁ గడపె నిశాంతవేళ. 9

అతని నేపథ్యపాండిత్యమక్షియుగళ
మభ్యసింపఁ బ్రయత్నించు నవసరమున
భావనాబలసముపలబ్ధంబు లైన
స్వప్నవృత్తమ్ములెన్నొ సాక్షాత్కరించె. 10

అట్టియెడలఁ బుడమిపట్టి కలతెఱంగు పలుతెఱంగులఁ దలంచు
కొన్నకొలంది 11

అవతంసంబున వ్రేసినట్లు నగిన ట్లర్థించి న ట్లంతలో
దవ్వులం బాఱినయట్లు డాగినటు లుద్యత్ప్రీతి సంధించున
ట్లవనీనాథతనూజుఁ డొప్పిన యథార్థాకారబుద్ధీంద్రియ
వ్యవసాయమ్మునఁ బర్ణశాలవెడలెన్ వైదేహి విభ్రాంతయై.

అపు డెంతయు జాగరమ్మునం జేసి 13

తెలివాలుం గను లొప్పఁగంది పయిపై దీపించు లేఁజెక్కులుం
బలుకంబాఱి ప్రియావలోకనకథాపాండిత్యసంపాదనో
త్కలికోత్ఫుల్లముఖేందుమండలసుధాధారాపరీతమ్ములై
జలకమ్మాడె నుదఙ్ముఖానిలహిమాసారమ్ముతోరమ్ముగన్.

అంతం గొంతసేపటికి 15

కులుకుం బైటఁ దెమల్చి ముంగురులనొక్కుల్ చక్కఁగా దిద్ది మే
ల్వలయమ్ముల్ పయికంటఁ ద్రోఁచి నిజనేపథ్యప్రమాదమ్ము లే
కలినీలాలక నెచ్చెలు ల్గడసి రేలా! యంచుఁ దత్ప్రాంతమం
జులకుంజాంతరదీర్ఘికాతలశిలాసోపానమధ్యస్థయై. 16

వైదేహి! యెటకేఁగితే యను సఖీవాక్యమ్ము లాలించి రం
డీ దారిన్ దడవేలసేసితి రిదే మే లోకబంధుండు ప్రా
గ్వధిం దోఁచెఁ బ్రభాతకృత్యములు దప్పెన్ గాలధర్మచ్యుతిన్
గాదే దోసమఁటన్నఁ జేరఁజని రా కళ్యాణు లిర్వంకలన్. 17

అట మున్నద్భుతకార్యతంత్రఘటనావ్యాపారపారీణు లు
ద్భటులౌ రావణసారణాదు లిట వృత్తాంతంబు చింతించుచు
తట్ట పార్శ్వంబున మందమారుతతరంగవ్యాప్తి నోలాడి య
చ్చటఁ గాల్యంబులఁదీర్చి మెచ్చుకొని రాసంస్థావిశేషంబులన్.

ఇట్లెంతయుఁ గొంతతడవంతరంగంబుల మురిసికొని కౌశికాపశదుం డిందుఁ గాలిడికమున్న జనకరాజసందర్శనంబునం గృతకృత్యులమై నివృత్తులమగుటయె తగవని వేగిరంబ రావణుండు రామభూమికాసామరస్యంబు లలవరించుకొనుడు. విద్యుజ్జిహ్వుండు విశ్వామిత్రవేషంబును, సారణుండు సౌమిత్రిపాత్రంబును గైసేసి రంత నంతస్సంతృప్తికంతరంబులఁ బోల్చుకొనుచు సొంతరూపంబులు దాల్చి

కొనుచు సంతసంబునఁ బొదలుచు మంతనంబుల మ్మొద
లుచు వేరొండు ముప్పు ఘటిల్లకుండ శుక్రదైత్యు నంద
నియమించి యొయ్యొయ్యనఁ బయనించుసమయంబున 19

జానకీస్వప్నవృత్తాంతసరణి దెలిసి
కన్న చెలువునిరూపరేఖలు లిఖింప
సాధనమ్ములు గొని తేరఁ జని యొకర్తు
తడసె నని వేరొకర్తుక తరలుటయును. 20

తలఁపుల్ రేఁగి ధరాతనూజమదిసంతాపంబు దీపింప నొ
చ్చెల జాగయ్యె ని దేల నేఁ డుదయలక్ష్మీపూజకై తాతపా
దులు వేంచేతు రిఁకేమిసేతు నను చెంతో చింతమైఁబలుకఁ ద
ల్లలితాలాప మెసంగెఁ గిన్నరకలాలాపాతిరిక్తంబుగన్. 21

ఆమాధుర్య వచశ్శ్రీవ
ణామోద భరాంతరంగుఁడసురాగ్రసరుం
డీ మున్యాశ్రమభూములఁ
గామక భాషింపఁగలవె కలకంఠంబుల్. 22

నావిని సారణుఁ డిట్లను
దేవా ! పికరుతుల దేటతెల్లమిగలదే
భావింప శారికాకుల
మీ విధ మెలిఁగించు నంచు నెంతయు బొగడెన్. 23

అయ్యవసరంబున 24

ఇంతకు రాక తక్కె చెలు లింతట నంతటఁ దారి రంచు సం
భ్రాంతనునస్కయై జనకరాజకుమారి కుమారమన్మథున్
జింతయొనర్చుచుం జిలుఁగుచీరచెఱం గిడి సారెసారె కా
ప్రాంతనివిష్టదృష్టియయి పల్కు సమంచితభావభంగులన్. 25

తొలుదొల్త జిఱునవ్వువెన్నెలపసందుంజిందునెమ్మోము నం
దలి సింగారముచూఱలాడుటకుఁ జింతాక్రాంతనేత్రంబు లు
వ్విళులూరం దఱచయ్యె నుత్కలిక లావేగంబు రెట్టించెఁ జం
చలచిత్తం బెసరేఁగె నేకరణి నాశ్వాసింతు నుద్రేకమున్. 26

ఆ సంస్థానవిశేషపుణ్యరచనాభ్యాసంబునం జేసి నా
వ్యాసంగంబుఫలించు దివ్యపురుషుం డా మోహనాంగుండు నా
కాసాంగత్యము గల్గు నెన్నఁడో? తదీయానందలక్ష్మీకటా
క్షాసారమ్మున దోఁగు టెన్నఁడో? విధివ్యాపార మెట్లున్నదో.

ఆ ముగ్ధేందుముఖావలోకనకళాహ్లాదంబు తన్మందహా
సామోదమ్ము తదీయముగ్ధమధురవ్యాహార మా నిస్తుల
ప్రేమ మ్మానిపుణత్వ మా చెలువ మా పీతాంబరస్వామి కా
శ్యామాంగప్రభు కేతగుం బరుల కేలా సెల్లు నీ యోగ్యతల్.

అని తొంటికైవడి శ్రవణగోచరంబగుడు లంకేశ్వరుం డావంక
నుపలక్షించి 29

పాప మెవ్వ రీ యభాగ్యతపస్విని
భర్తృవిరహదుఃఖభాజనంబు

విదురహృదయమె త్తి వ్యథగూరుచున్నది
లజ్జ గ్రుంకు విప్రలబ్ధవోలె. 30

అదియునుంగాక 31

పలుకునఁ దేనె లుట్టిపడు భామినికోమలకంఠమాధురీ
కలనము నా కపూర్వమగు కర్ణరసాయనమయ్యెఁ దత్తనూ
విలసన మెట్టిదో ? యచట వెల్వడివచ్చు మరుత్కిశోర మిం
దలమికొనన్ గళాభిదురమయ్యెఁ గనుంగొనుమన్న సారణున్.

అతఁ డా మంజులకుంజపుంజములు తోయాధారతీరమ్ములున్
లతికాకల్పితమంటపాంతరము లంతర్వేదికాప్రాంతముల్
వెతకెంగాని ఫలమ్ము దక్కదని తెల్పెన్ రిత్తవృత్తాంత మా
దితిజస్వామి కతండు ఆచ్చవడె నెంతేనంతలో వింతగన్. 33

అక్కట ప్రాలుమాలిరో ? వయస్యలు లేఖనసాధనమ్ము లే
దిక్కునరోసిరో ? సరగఁ దెల్పిన నేఁ జని తెచ్చికొందునే
చిక్కులఁ ద్రోసి రంచు సరసీరుహలోచన వల్క వారి కే
దిక్కును దోఁచ కంతటఁ బదింబది రోయుచు డాయుచున్నెడన్.

ఆధారమే లేని యాధేయమునకు నీ
వ్యాహారమే సాక్ష్య మనె నొకండు
మునిప్రముచ్చు లీ తంత్రములు ఘటింపకయున్న
మనమాయ గడచుటె ట్లనె నొకండు

రిత్తబయల్ గాలియొత్తడి కెసరేఁగి
పెనుగుబులెత్తించె నటె నొకండు
మనసు దీఱక గతించిన నిండుజవరాలి
ఆత్మప్రలాపమా యనె నొకండు
అంతకంతకు నుబలాట మగ్గలింప
జిహ్వ కసరూడ మీసముల్ చెఱ్వకొనుచుఁ
జేవచెడఁ జూచి రానడబావిపొంత
సాంత్వనములాడ దొరకొన్న జవ్వనులను. 35

ఆ లలితాంగు లాడు వచనాద్భుతభంగులు కప్రమహస్త సం
చాలనచారిమంబులు హసన్ముఖవీక్షణవిభ్రమంబు లే
లోలవిలోచనాపరములో యని వారివిలోకనప్రభా
జాలము లోలగించినవి సన్నతగాత్రలకిర్వలంకులన్. 36

ఎంత ప్రయత్నపడ్డ నట నిర్వురు కాంతలుదక్క నన్యసీ
మంతిని గానరా కచట మంజులకంకణనిక్వణంబు ల
త్యంత మనోజ్ఞ భాషణము లద్భుతభంగిఁ బ్రవర్తిలం బరీ
క్షింతురు సంభ్రమింతు రవశీకృతచిత్తులు దానవోత్తముల్. 37

ఈ మాయామయసంవిధానమున కెంతే స్వాంత మింతింతలై
మోముల్ ముచ్చముడింగి దైత్యవిభుఁ డాపూబోండ్లవీక్షించి వీ
రా మాయావిని చెల్మికత్తెలు దదీయాలాపము ల్వింటిరే ?
భామాప్రేమనిదానమే మొబయలుబ్బంజొచ్చెనొయ్యెయ్యనన్

మఱియు నందు 39

చిబుకము దువ్వి ముంగురుల చిక్కెడలించి నలంగుపాపటన్
సొబగులు దిద్ది చెక్కిళుల జొబ్బిలి చెమ్మటలార్చి పయ్యెదన్
దిబురులువాపి నేవళము దీరిచి సారెకుముద్దుచేయు నా
యబలలచెంత నున్న లలితాంగి యెవర్తుకొ గోచరింపదే! 40

అయిన లతావితానవలయమ్ముల డాగి తదద్భుతంబులన్
మయిమయిగాంచవచ్చు ననిన న్విని దేవరవారి కిమ్మెయిన్
భయపడ నేమివచ్చె నటువంటి తిరస్కరిణీప్రభావ మెం
తయినను దీర్చు రండని నయమ్మునఁ బల్కె నొకండు నమ్రుఁడై.

వారంత నక్కాంతల చెలువమ్ము నలవోకం దిలకించుచు
నదృశ్యాకారప్రకారంబు లెట్టిటివో యని గొట్టుమిట్టాడు
నవసరంబున 42

ఎంతని తేర్తురే? హృదయ మెచ్చటఁ గ్రుంకెనొ వల్లకాదు మీ
కింత పరాకునన్న పరు లెవ్వరు సూచిన నొంటిపాటు నె
చ్చెలులు చూచిచూచి కను లెంతయుఁ గాయలుగాచె దైత్యలీ
ప్రాంతము రారె కాక గురుపాదులబోధలు గుర్తెఱుంగరే. 43

నెచ్చెలి! తప్పఁగ్రుంకుటకు నీ కెటువారమొ? మాకునై వృథా
పుచ్చిన కాల మున్నదె మముం దడ వాగిన నీదు తండ్రితో
నచ్చికలాడి వచ్చితిమి నమ్మకపోవఁటె జానకమ్మ! నీ
ముచ్చట దీర్చుకంటెఁ దలపోయఁ నికొండొక కార్య మున్నదే.

వెఱ వేల రాక్షసాంధం
కరణమణీకంకణములు కౌశికమౌనీ
శ్వరులు ప్రసాదింపంగన్
దరుణీ ! పొడకట్టఁగలవె దైత్యుల కెందున్. 44

కాన భయంబు దక్కి కలఁగన్న మనోహరదివ్యరూపసం
స్థానము నూహసేసి ససిచక్కి లిఖింపు మనన్ ముదంబునన్
జానకి కన్నుల న్నగి నిజంబుగ నా నవమోహనాంగు సం
స్థానవిశేషముల్ పలుక శక్యముగావు రచింప శక్యమా ? 45

నా విని భావనసేయుము
దేవీ ! యని పల్కఁ జెలులు తీయని తలఁపుల్
లోవెలిఁ బర్వగ మైథిలి
భావించి లిఖింపఁదొడఁగె భావజరూపున్. 46

దానం బ్రకటితమగు న
మ్మానినివృత్తాంత మంత మది సరిదాఁకన్
దానవమానసవీణల
నానందాశ్చర్యసంభ్రమాదులు మొరసెన్. 47

అంతం గొంతసేపుదనుక 48

ఒండొరు నుపలక్షించుచు
నొండెడ నుపలబ్ధమైన యుక్తుల తెఱఁగున్
గొండాడుచుఁ బందువుగాఁ
గొండొకవడి గడపి రసురకుంజరు లంతన్. 49

పౌలస్త్యుఁ డా కళావతి
హేలాలీలావిలాస మెద్ధు భజింపన్
జాలక యాలేఖనవిష
యాలోకనజాలసమ్మదాశ్రులు చిలికెన్. 50

లంకేశ్వర ? మాయాముని
శంకాతంకాత్ముఁ డగుచు జనకాత్మజ కీ
కంకణములు దొడె నని మదిఁ
గింకిరిపడి సారణుండు క్రీఁగనులార్చెన్. 51

ఆ అంశుమాని గెడపక
మారీచుం డున్న బద్ధమత్సరు లెందుం
గారని విద్యుజ్జిహ్వుఁడు
దూలెం గసిదీఱ నోటిత్రుప్పు దొలంగన్. 52

వారిట్లు పలుపోకలంబోయి 53

లలితాంగక్రమ మొప్పఁ జిత్రరచనోల్లాసంబు సంధిల్ల మై
థిలి చిత్తరువ్వ లిఖించువేళఁ గడలుద్దీపించు శృంగారరే
ఖలు, స్వాభావిక భావపోషణచమత్కారంబులున్ మాలికా
చలనాదుల్గను దానవేశ్వరుని వాంఛాస్ఫూర్తి ప్రేరేపఁగన్.

సారణుఁడో ప్రభూ ! జనకజామణికంకణముల్ హరించి మీ
కోరికఁ దీర్తు నన్నుఁ గనుగొల్పుచు శూర్పణఖాప్రియుం డనున్

సైరణసేయుఁ డా కుసుమసాయకుఁ డెవ్వఁడో తెలుదనఁ నా
కారవిశేష మిట్టి పొడగట్టఁదొడంగెఁ గ్రమక్రమంబుగన్. 55

అందు మహానుభావ మరుద్దైకనుపట్టు మహానుభావుఁ డిం
కెందుఁ గలండు దానవకులేంద్రుఁడుదక్క దదీయరూప మీ
సుందరి వ్రాయుచున్న దనఁ జూచి దశాననుఁ డొల్లపోయి నా
చందమె కాదు చూడుఁ డన సారణుఁడుగ్ బరికించి యిట్లనున్.

ఔ నెటులంటిమో తెలియ దద్భుత మీనవమోహనాంగుఁ డే
మానవనాథసూనుఁడో ? సమగ్రవినిర్మితపుష్పబాణుఁడో ?
ఆ నగుమోముచక్కఁదన మా నవనీరదనీలగాత్ర మా
జానువిలంబిబాహువులచందము డెందము చూఱలాడెడున్.

అంతటఁ బజ్జికంరుఁ డచలాకృతిఁ గన్గొని వీనిరూప మ
త్యంతమనోజ్ఞ మాకృతిమహత్త్వము శత్రులకైన మైత్రి న
శ్రాంతము సంఘటించు ముఖసౌమ్యత ముచ్చటఁగొల్పు స్వర్గప
ర్యంతము నిట్టి రూపము లోకవ్వుడుఁ జొప్పడవేలకో యనన్.

విద్యుజ్జిహ్వుం డచ్చిత్రపటం బుపలక్షించి ముగ్ధశిఖండమం
డలావతంసప్రశంసాపాత్రమ్ములగు నేత్రంబుల నంగకమ్ములు
నివాళించి అ ద్దివ్యమంగళవిగ్రహుని యపాంగప్రాంగణం
బులు మంగళదేవతాసంగీతభంగీతరంగితశృంగారరంగంబు
లనియు నప్పృచండకోదండపండితుని భుజామండలంబు
భండనోద్దండ రిపుశిరఃఖండన పాండిత్యమండితం బనియు

ఆ బ్రహ్మచర్యదీక్షాదక్షుని వక్షస్థలంబు ధైర్యలక్ష్మీకటాక్ష వీక్షానిక్షేప మనియు నా జగన్మోహనాంగుని నవయౌవ నంబు మానినీమానసానూనసూనశరాసనోజ్జీవనస్థానం బనియు సృష్టికిం బరాకాష్ఠయుఁ, బ్రకృతికిం బరపతియు, నానందసన్నిధియు, నాశ్చర్యసేవధియు నగు దాశరథి లావణ్యశరధిం దఱిసి మురిసియు నోరసియుం బదింబది నెదురీఁదు విలోకనవీచికలం దొప్పదోఁగి పుంభావంబుడిగ్గఁ ద్రాగి తాదాత్మ్యబుద్ధిం దద్రూపసమృద్ధి కెంతయుఁ జిం తించి దేవా! నీ రాడు జాడలంబట్టి యిట్టి శుభలక్షణలక్షి తుండు దశరథసుతుండుగాని వేరొండుగాదు. మఱియు నిం దదృశ్యయగు పైదలి మైథిలిగాని మఱొండు గాదని తారార్కాణసేయుడు దైత్యశ్రేష్ఠుం డీర్ష్యాగ్రహావిష్టుండై సారణా! కాలహరణంబొనర్పక కంకణాపహరణంబు గావింపుము పదంపడి కర్జంబు మెఱయింత మని తఱిమి పలికిన 59

గోమయభస్మంబు గుస్తరించు లలాట
పట్టిపైఁ గుంకుముబొట్టు మెఱయ
మొసలివాకుండలమ్ముల బెడంగడఁగించు
జారుచెక్కులనవ్వు బూరటిల్ల
ఎద మిట్టిపడు దొడ్డరుదురాక్షపేరులు
ముదుగుజన్నిదముతో ముచ్చముడుఁగ

పింజించికట్టిన పిరిసుట్టుపుట్టంబు
మోఁకాలిచిప్ప లట్టాఁకవెట్ట
పొడుము గుడకమ్ము రొండిపై మిడిసిపడఁగఁ
బ్రాఁతపంచాంగ మఱచేతఁ బలవరింపఁ
బరితపంచాక్షరీప్రభావం బెసంగ
ఛాందసబ్రాహ్మణుం డయ్యె సారణుండు. 60

అంతట 61

తోడ్తోడ నగ్గించి త్రోలి రయ్యసురలు
నా ధూర్తుఁ డచ్చోట కరుగుదెంచి
ఎవరమ్మ! మీర లిం దేకత మున్నారు
ధరణీసురుఁడ నయోధ్యానివాసి
నాయాసమునఁ గుస్సి యరుదెంచినాఁడను
బడలిక వాపి కాపాడరమ్మ!
పుణ్యంబునన్ బోరె పురుషు లిచ్చటు రారె
ఆర్తశరణ్యు లెందైన లేరె?
అని వగర్చి గుండె లదవద లగునట్లు
కూలఁబడియె వారి మ్రోల నంత
సీత యచ్చపడియెఁ జెలికత్తె లిర్వురు
మాటమంతి దక్కి మ్రానువడిరి. 62

అప్పాటున 63

కరఁగు మైపూఁతతో ఘర్మాంబుకణములు
  వ్రేలు పూఁబాళితో వాలుజడలు
నెత్తావిబర్వతో నిట్టూర్పుగాడ్పులు
  పరువంపుఁబైరతోఁ బయ్యదలును
చనుకట్టువ్రేఁగుతో జవ్వాడు కౌనులు
  కలికిరుచ్చెళ్ళతో గాఁగరలును
కరపల్లవములతోఁ గంకణక్వణములు
  త్రోపడు కాళ్ళతో నూపురములు
నిశ్చలత్వమూను నిమిషార్థమునయంచు
అతిథిసేవ కంతరాత్మ పెనఁగి
పాఱువార లెంత వడివచ్చిరో యమ్మ!
సేదఁదీర్పుఁ డంచు సీత వలుక. 64

సఖులు శీతలోపచారము లొనరింపఁ
గొంతవడికిఁ దేఱి సంతసించి
కాంతలార! మీకుఁ గళ్యాణమస్తని
అణఁగి పెనఁగిలేచు నసురఁ గాంచి. 65

ఆ చెలికత్తియలెల్ల రొక్కుమొగి న్మ్రాగి 66
వలదు కూరుచుండుఁ డలసినారేమిటఁ
దెరువుఁదప్పినారొ ? పఱచినారొ !
మీ రయోధ్యవారె ! మేల్మేలు మఱచితి
మెవ్వరైనఁ బంపిరే ? మహాత్మ ! 67

అంపకేమి ? దరథావనీశ్వరు సగ్ర
సుతుఁడు రామభద్రుఁ డతఁడు సూవె
అకట ? నీరువట్టె నాయాసమెగఁదట్టె
వేఁకి సోఁకె నాకు వెలఁదులార ! 68

అనిన సీత ప్రియున కాపద భావించి
నీరు దేరఁ బంచి గారవించి
త్రావుఁ డంచు నీయఁ దరుణు లంటిన దెద్ది ?
ముట్టనంచు వాఁడు మూర్ఛఁదోడఁగె. 69

అంత మైథిలి కెందుంబాలువోక యిప్పాటుండు నాహృదయాధి నాథుని కొదవిన యాపద నుగ్గడింప నోడి మఱుంగుచున్న వాఁడు ఇంత కప్రియకథన మొండె నాత్మ నిధన మొండె భావించువాఁడపోలెఁ జూపట్టు. ఆత్మీయు లవసరంబు పట్టులఁ దామై గుట్టుమట్టు లలవరించుకొని వెలి కుబ్బుదు రనుచుం జింతాక్రాంతస్వాంతయై పరితపించుచున్న సమ యంబున నచ్చెలి నెచ్చెలు లోయయ్య ! మమ్మిట్లలయింప నీ కేమి లగ్గగు. మా మనంబు లరయుం దలంచి కాదుగదా ? మా ప్రాణసఖి మఱుంగుచున్నకొలంది మా యెడందలు దరికొనుచున్నవి. నీకైన తెలంగాడు మిందాఁకట్టువారెవ్వ రుందురు. అట్లైన నీ యవ్వయుం జింత దకుక నెకరణిం బోల్చుకొన్న రక్కసి తెలంగుసన్నె. అదియుంగాక నీ చెప్పఁ

దలంచిన వృత్తాంత మ్మరవిడిచి చెప్పు మిందొకంపు వుట్టిన
నాత్మలం దొలంచి బాధింతు మింకఁ గామక కలహా పెటిం
గించి పుణ్యమునం బొమ్మని సమ్మతిలం బల్కిన నక్క
హానాభూసురుండు 70

రక్కసి యన్న పల్కునకు
రాపడి గోపనమొప్ప జానకీ
దిక్కయి మస్తకం బటిటు
ద్రిప్పుచు గ్రుక్కిళు మ్రింగుచున్న నా
తెక్కలిబాపనిం గని ప
డింబడి నెచ్చెలు లారటిం చిదే
మ్రొక్కెదమన్న ! దాఁ పురము
మోసము దోసము సంఘటించెడున్. 71

నిక్కము దాపకున్న రమ
ణీయమణీవలయమ్ము లిచ్చి నీ
కెక్కుడు గూర్పువారము మ
హీసురవర్య ! కలంతఁ జెంది మా
చక్కెరబొమ్మ దుఃఖపడ
సాగెఁ గనుంగొనుమన్న నుల్లమం
దక్కటికమ్మువూని నటు
లాడె దురాత్మకుఁ డుల్లసిల్లుచున్. 72

ఏమిటి కీవగల్ దశర
ధేశ్వరుఁడున్ గుశికాత్మజుండు శ్రీ
రాముఁడు ఱేపా మాపా యిటు
రాఁగల రీ లలితాంగి కా పరం
ధామున కగ్నిసాక్షిగఁ బ్ర
ధానవివాహవిధుల్ ప్రవర్తిలున్
నోములు నోచి నమ్మల మ
నోరథముల్ దయివాఱకుండునా !

అంతట నెచ్చెలుల్ జనక
జా ! నినువంటి యదృష్టవంతురా
లింతుల లేదు ఱేపె హృద
యేశ్వరుదర్శనభాగ్య మబ్బు నం
చెంతయు ముద్దుసేయ మిథి
లేంద్రతనూజయు సమ్మదామృతా
క్రాంతి సముద్ధతిన్ స్వకర
కంకణముల్ దెమలించునంతలో. 73

అనసూయాత్రిమహర్షి పుంగవులు బిడ్డా ! నిన్ను దీవించు కాం
క్షను వేంచేసిరి గాన వేగమ నమస్కారంబుగావించి దీ
వనఁ గైకొందువు రమ్మఁటన్న పిలు పావామాక్షులాలించి తె
ల్పిన నాసూడిగముల్ విదిర్చి చనె నా లీలావతుల్ వెన్గొనన్.

చిత్తరువున్ గణింపక రచించెడు సాధనముల్లలంప కా
పుత్తడిబొమ్మ తండ్రిపిలుపుల్విని సోఁకినమాత్ర సర్వము
న్వేత్తగ డిగ్గఁ ద్రావి కడువేగమునం జనె నెంతభక్తియో
అత్తరళాక్షికిన్ జనకునందు మునీంద్రసపర్యలందునన్.

ఇప్పటికింక రావణున కెత్తినపిచ్చి తొలంగ కక్కటా ?
తప్పి చనెన్ మృగాక్షి మొగదప్పదు చిత్తము పర్వునప్పుడా
యొప్పిదమేమి సెప్ప కడలొత్తినకాంతులఁ గ్రుమ్మరించుచున్
జప్పున మాయమయ్యె ఘనసంచరదంచితచంచలాకృతిన్.

కడియములూడ్చు వేళఁ బొడకట్టిన హస్తతలంబు లింపుగా
నడిచెడివేళ నట్టిటు పెనంగినవాల్జడ దక్క రూపమే
ర్పడఁగనుపట్టదయ్యెఁ బడుపాట్లువృథా చనె దైవనిర్ణయ
మ్మడుగునె? ప్రాఁకులాడి బయలూడ్చినబారల కెక్కుడబ్బునే!

అని వెండియు భావనాబలోత్సేకమ్ము కతంబున. 78

రంభాకుచద్వంద్వ రచనావిశేషంబు
లఱచేతులొయ్యొయ్య నభ్యసించె
ఊర్వశీనయనోత్పలోపబృంహణములు
పేరురమ్మొక్కింత పిడికిలించె
మేనకాగమనగంభీర సందర్భముల్
కనుగొలుక్కలట్టిట్టు గ్రక్కదల్చె

వింధ్యావళీపుష్పవేణికాభారముల్
భుజపీఠమూపోవఁ బుక్కిలించె
వారి సింగారమిట్లూట లూరుకొలఁదిఁ
మైథిలీమోహనాంగకస్మరణఁదవిలి
ప్రతిపదమ్మున మోహావిభ్రాంతులడర
భావవీథుల విహరించె రావణుండు. 79

పిమ్మట సారణుండు తదభీష్టమెఱింగి నికామతప్తుఁడై
నెమ్మనమందుఁగుందుచు మణీవలయమ్ములు రూపచిత్రమున్
గిమ్మనకుండఁదెచ్చి పరికించు ప్రభూత్తముమ్రోలనిడ్డఁగన్
దమ్ములువిచ్చిచూచి ప్రమదమ్మునఁగైకొని సమ్మతింపఁగన్.

తదనంతరకర్తవ్య
మ్మొదలంబొదలంగ దైత్యులేఁగిరి సుమన
స్సదనామోదభరాసవ
వదనాలీమిలదనూనవనవీథులకున్. 81

ఇంతలో నత్యంతవినయాతిరేకంబునఁ జనుదెంచు జనకనం
దిని నల్లంతంగనుంగొని మునిదంపతు లింతింతనరాని సంత
సంబునం బొదలుచు 82

ఆదిమదంపతిప్రణయ మమ్మకు నచ్చునఁబోసినట్లు దా
మోదరప్రేమచిహ్నములు మోమున వ్రేలెడు దుర్మదాసురో

న్మాదమదాపహర్త్రయగు మాధవప్రేమనిదానమేమి భా
గ్యోదయమో? యెదురొ్కనుచున్న దికన్నులకర్వదీఱఁగన్.

ఆకన్నుల్ కలశాబ్ధిగర్భకుహరవ్యాలోలకల్లోలముల్
జోకొట్టుం బరిబాధితామరగణస్తోత్త్రాయమానాచ్యుతా
లోకవ్యాకులముజ్జగించుఁ బ్రణమల్లోకేశ్వరానీకహే
వాకస్వాగతముల్భజించు మురజిద్వామాంక పీఠంబునన్. 84

సురలమ్మాధవుఁ గొల్వవచ్చిన సుధాంశుఙ్ బిండిదుగ్ధాబ్ధిలోఁ
గరదుల్దేర్చి భుజింపఁబెట్టు మునిసంఘంబాదిగర్భేశ్వరీ
కరుణాపాంగతరంగసంగతమనఃకంజాతమై కొల్చు టెం
తరుదో? నాఁటి సపర్యలిప్పు డనసూయా! నీకు గుర్తున్నవా?

తమదేహప్రతిబింబసంగతములై ధమ్మిల్ల మందార పు
ష్పము లల్లల్లన జారినట్లు సతి సంభావింపఁగాఁ బూరుషో
త్తముఁడుఙ్ బచ్చుపటంబు జారినటులుద్యత్ప్రీతి సంధింప నీ
కమరెన్ మంగళదేవతాచికురమాలాకల్పనం బెంతయుఙ్. 86

మునిబృందమ్మున నీదు పేరఁటము నామోదించి తొట్రొల్త్రవా
యన మెత్తించిన లోకమాత ననసూయా! యెంతకీర్తించి తే
తనవంత్రై భువనాభిరక్షణకుగా ధర్మాసనాధ్యాసియా
వనజాక్షుం బురికొల్పుచున్న దసురవ్యాపాదనోత్కంఠతన్

ప్రాలేయాచలరాజకన్యక భజింపఙ్ శారదాదేవి గీ
తాలాపామృత పూరపూరిత సమస్తాశావకాశంబుగా

నోలాడింప సుధాబ్ధి పెందఱఁగలం దోలాడులోకేశ్వరీ
లీలామానుషవిగ్రహంబు దనిపెన్ లిప్సాతి మాత్రంబుగన్.

అని బహువిధంబుల నమ్మధుమధనవధూకథాకథనప్రసంగతిం
జొక్కు నప్పుణ్యద్వంద్వంబు సన్నిధికి 89

అల్లననేగుదెంచి జనకాత్మజ ముగ్ధముఖారవిందము
త్ఫుల్లముగాఁ గరాగ్రములుమోడ్చి ప్రణామము లాచరింప వా
రుల్లము పల్లవింపనగుచో మిథిలేంద్రకుమారి ! చక్కవ
ర్థిల్లు మభీష్టదైవము వరింపు మితోఽధికవృద్ధి చొప్పడన్. 90

అని మఱియు 91

విశ్వమంగళపాద విన్యాసధన్యమై
వైకుంఠధామంబు వన్నెకెక్కె
పావనజన్మ సంబంధ బంధాఢ్యమై
విశ్వంభరాదేవి వినుతిగాంచె
వాత్సల్యపరిపూర్ణ వైభవోపేతమై
జనకరాజర్షి వంశము తరించె
మానితసౌందర్యమాధుర్యధుర్యమై
ప్రకృతిసౌభాగ్యమ్ము పరిమళించె
క్షీరసాగరకన్యకా ! చెప్పవలదె
విశ్వగర్భుఁడు నీవాఁడు వేదమాత
కన్నెకోడలు నలువ నీకన్నవాఁడు
అమ్మలకు నమ్మవమ్మ ! నీ వాదిలక్ష్మి ! 92

అన మస్తమ్మరవాంచు మైథిలినపత్యప్రేమ సంధిల్ల ర
మ్మని యంకమ్మున నెద్దియిపట్టి యనసూయాదేవి ముద్దాడ న
మ్మని లోకోత్తరుఁ డత్రిమానివలుకున్ భూపుత్రి! నీ కేముదె
చ్చిన చీనాంబర మంగరాగమును గైసేయంగదే నిచ్చలున్.

దీనం జేసి. 94

జానకి ! యక్షరాక్షస పిశాచభయమ్మదొలంగు శీలమెం
దైనఁ గొఅంతగాదు సరహాస్యము నీనిమహాత్వమెల్ల వై
మానిక మానినీమణులు మానక తాల్తు రజస్ర మాశచీ
జానికి మాకుఁ దక్కఁ బరసమ్మతిఁ గైకొనరాదొకింతయున్.

అని కానుకవెట్టుటయు జనకనందిని వాని నత్యంత భక్తితాత్ప
ర్యంబున నందిపుచ్చుకొని పునఃపున రభివాదన పురస్స
రంబుగ వినయవినమితగాత్రయై తండ్రి యనుమతి
నప్పుణ్యదంపతుల వీడ్కొని నెచ్చెలులే తేర నగ్నిశరణా
ళిందంబు సొచ్చి స్వాహాకారముకుం దనిపి నియతంబగు
భూతయజ్ఞం బాచరించి యథార్హ కృత్యంబులం బ్రవ
ర్తిలుచున్నంత నాఁడొకేఁడుగాఁ గడ చనుటయు. 96

కనులు గనులయ్యె లులితకంకణములయ్యెఁ
బగలు వగలయ్యె దోషాతి బహుళమయ్యెఁ
దరుణికారామదర్శనోత్కంఠ ప్రబలి
గగన మనిపించె యావనగాథ కొంత. 97

# సిద్ధాశ్రమము

## చతుర్థవీధి



అటమున్న గాధేయ పురస్సరుండై పఙ్క్తిరథుండు ముఖ్య బంధుమిత్ర పుత్ర సహితం బేతెంచువాఁ డయోధ్యా మార్గమధ్యారణ్యభూములం దఱిసి బహువిధ ఫలపుష్ప సంభరితానేకతరులతాగుల్మవీధులం దాఱసి తదీయ పక్వఫలరసధారాపూరంబులం దోఁగుచుఁ, దత్సుమ సుగంధబంధురగంధవాహసందోహంబులం దూఁగుచు; విచిత్రపత్త్రోదంచితశకుంతసంతానగానమాధురీమేదురంబు లగు వనవీధులం దాఁటుచుఁ బ్రచ్ఛాయశీతలశిలాతలోప

విష్టమృగకదంబశృంగారచేష్టావిశేషంబు లారయుచు, వన్యవారణగండమండలవిఖండనోద్దండనఖముఖపాండిత్యభాసురకేసరీగర్జనభర్జనంబు లుపేక్షించుచుఁ, బరిసరగిరిశిరస్స్ఫురత్ఝరీవారిధారాప్రపాతంబు లభివీక్షించుచు, రమణీయసరోవరసరోజకుముదకల్హారపరాగపరంపరానిరంతరాంతరాంతరంబు లపేక్షించుచు, గరువులు గడచి, రేగడలు విడిచి, శర్కరిలంబుమెట్టి, సికతలంబునెట్టి, పాయల నెడసి, లోయలవిడిసి, మందార వనంబులయు, మాకంద బృందంబులయుఁ, జందనవాటికలయు కెళవు పట్టులు దప్పించి వలనుగల మొగజోదు లిర్వంక లేతేర రహస్యమార్గంబు పట్టిపోవు నవసరంబున 1

మొగదప్పి నుష్ట్రంబు దగదొట్టి నడిపీపు
చదును వోనెత్తిన సంబళముల
జబ్బలీడ్చి నిభంబు చలుపెత్తి వెనుపట్టె
జారనెత్తినయుద్ధ సాధనముల
మోఁకరించె మహాత్ముమీఁకువైయట్లంత
తునిసిపోఁ గట్టిన యినుపబండ్ల
బడలె బోయీాదండు వడగొట్టి మెడలూడ
నఱచి తెచ్చిన పైఁడి యందలముల
నిట్టనిల్వనఁ జెమ్మట లుట్టిపడఁగ
గుట్టుపుదువాళ మఱకాల గ్రుక్కవట్టె

అంతకంతకు దసిలె శుద్ధాంత జనము
పెండ్లిపెద్దలు పొల్పఱి బెండువడిరి. 2

అట్టియెడ 3

కోదండంబు భుజాగ్రమందు నిడి ది
కుంభిన్ గ్రక్కదిల్లంగ న
య్యాదిత్యాన్వయవర్ధనుండు పరివా
రాగ్రేసరుండై మహా
సాదిప్రోథరథాశ్వ సంకులముగా
సన్నాహసరంభ సం
వాదం బేర్పడఁ బెండ్లివారి నడిపిం
పం జొచ్చెమూర్తంబునన్. 4

పెను మొయిళ్లు లడరె విద్యు
ద్ఘన దుగ్రజ్వాల లెసఁగె గప్పున మండెన్
వనవీథి నింగి దూఁటిన
యనువున రక్తంబు గురిసె నచ్చటి ప్రజపై. 5

మాయామృగములు గవిసెన్
గోయని నల్లడలఁగాకఘూకము లార్చెన్
గూయుచు వఱళులు వఱచెన్
బ్రోయుచుఁబైఁ బడిరి దనుజ ముష్కరులంతన్. 6

వెలుకుటి జనసముదాయము
పలపలనై విఱిగి రాము పాలికిఁ బఱువన్
దెలికన్నదోయి నివ్వాక
లోలుకన్ రఘువంశతిలకుఁ డూర్ధ్వముఖుండై. 7

జలదధ్వానగభీరధీరమగు ను
చ్చైర్నాద మొప్పన్ దిశా
తలమాయాతిమిరప్రభాపటల వి
ధ్వంసంబు గావింపఁగా
జ్వలదాగ్నేయశిలీముఖంబు దొడి యా
స్ఫాలించి వేయన్ నభ
స్థలసంక్రాంతగుభుల్ గుభుల్ ధ్వనిపరీ
తంబయ్యె దిక్చక్రమున్. 8

దానన్ దానవ కల్పితాంధ మురవై
తద్దివ్య బాణప్రభా
లీనంబైన సుబాహుఁడంత రణ కే
ళీ దోహాలుండై సము
డ్డీనప్రక్రియ నుప్పరం బెగసి ద
ట్టీప్రీల వర్షించెఁ బా
షాణవ్రాతము జర్జరం బయి ప్రణ
ష్టంబై జనం బార్వఁగన్. 9

అయ్యెడ నయ్యుద్ధరంగం బుత్తుంగతరంగ సంగతంబగు మహా
జలధి చాడ్పునఁ జూపట్టె నయ్యెడ 10

గోడిగల్పర్వ వెన్కని గుఱ్ఱపుంబౌజు
వ్రేటీక గగ్గోలు వెట్టిపఱచెఁ
గుంభముల్ వ్రీలి దిక్కులు మ్రోయఁ దలలిచ్చి
గజయూథ మొంటెల, గాడు పఱచె
పట్టెడల్ ద్రెస్సి గిబ్బలువాఱ శకటముల్
తలక్రిందుగా జనుల్ తట్టువడిరి.
ఈడఁబోక బలంబు లింతింతలై చాప
కట్టుగఁ బడి బిట్టు గ్రక్కతిల్లె

వారువీరేల యా శిలావర్షమునకు
నన్ను పట్టని ప్రాణి లేదట్టిచొప్పు
తలఁప శక్యము గాదని దశరథుండు
కన్న విన్నది గాదని గాధిసుతుఁడు. 11

భయసంభ్రమంబు లుడ్డాడ రామభద్రుం ద్వరపెట్టుటయు
నతండు 12

జ్యానాద మెసఁగనేసిన
బాణాఘాతంబునకు సుబాహుం డీల్గెన్
దానన్మారీచాదుల
మానసములు రోషఘూర్ణ మానములయ్యెన్. 13

అంతఁ బోక తాటకాత్మజుం డెనరేఁగి
వాయుమండలంబు వల నెటింగి
నింగి పీటవెట్టి నిప్పుకల్ వర్షింప
నీడఁబోక కోసలేంద్ర సుతుఁడు. 14

జలదాస్త్రంబునఁ దత్ప్రతాప జటిల
జ్వాలా ప్రభావంబు ని
ష్ఫలముం జేసి యమాంత మెత్తి మరు ద
స్త్రంబేయ మారీచుఁ డ
బ్బలవాతూలవిఘాతఘూతతనుఁడై
ప్రాంచన్మహేంద్రాచలాం
చలకల్లోలసముద్రమధ్యమున మూ
ర్ఛావిహ్వలుండై పడెన్. 15

తకుకంగల రక్కసిమూఁకలు దిక్కుమొగంబులైనం బిడ్డ
పాటించు కంతయుం దలంపక కక్కసించి మున్ను వెన్ను
దన్ని నిల్చిన చొప్పు దప్పించి తాటక యాటోపంబున
నెట్టన మొనగట్టి మోహరించుటయు సౌమిత్రి యాగ్ర
హోదగ్రుండై యగ్రజుతలఁగడచి 16

రొంపిగలంచిన సొంపునన్ గుండియల్
ప్రేవులు నెత్తుటం బెరయనేసి
కరచరణాద్యంగకము లివ్వి యనరాక
కడికండలుగ నొడల్ గాడ నేసి

మోటాస పడువారి మొగమొగంబులుమొత్తి
ప్రకటి లొత్తినవారి బారిసమరి
మాయ గూరినవారి మఱుఁగుఁ దిత్తులు దుల్చి
పైఁబడువారి తీవరమదల్చి
కాలఁగేలఁగోలఁ గడకందు వఱకెల్ల
నూఁచకోఁతఁగోసి యుప్పరించెఁ
బోఁగఁ దక్కినట్టి పుణ్యజనంబెల్లఁ
గాలికొలఁదిఁబాఱెఁ గలను విడిచి 17

అంతందాటక మేనువెంచి సకలా
శాగ్రంబు లుడ్డాడ దు
ద్ధాంతాభీల నిజాస్యగహ్వర వికా
రధ్వాన విద్రావిత
ప్రాంతంబెల్లెడఁ దానయై తరువులుం
బాషాణముల్ ద్రోణముల్,
కుంతంబుల్ గొనివైవ గాధి సుతుఁ డా
క్రోశించి పల్కెన్ వెసన్. 18

సైరణసేసినన్ దనుజ
చక్రణఁగింపక పోదు రామభ
ద్రా! రణధర్మకోవిదుఁడ
వై వెనుదీయుట పాడిగాదు దు

ర్వారమదోద్ధతత్వమునఁ
బైఁబడె మారిమసంగినట్లు ది
గ్వారణ సన్నిభాంగి బల
వద్రిపు భీషణ ఘోషణంబుగన్. 19

పుట్టుక కాఁడుదియై పే
ర్వెట్టిన మగరాయఁడయ్యెఁ బెద్దయుఁ గాలం
బెట్టో వేఁగితి మాయువు
పట్టులు బిగఁబట్టి సైప వచ్చునె దీనిన్. 20

కానలం గోనలం దానుపానులరసి
గుండెలఱచేత నిడిమఱి కూరిక్కినాము
తృప్తిదీఱ యజించిన దినము లేదు
కఱవుదీఱ భుజించిన గడియ లేదు. 21

ఆహవనీయాగ్నులాఱి నెత్తుటి వట్టు
దిగువాఱగా మున్గితేలినాము
సిడివ్రేలు మాడిక్కిరాపడియూపములమీఁద
బిల్లబీటయి సారెవ్రేలినాము
పొడిచి తీసిన నారలడుగ బొప్పులు గట్టి
ఒడలి చీరలుదక్కి మిడికినాము
లంబకూర్చము లూడ్చి లాలారసము నింప
మిన్నక గ్రుక్కిళ్లు మ్రింగినాము

ఎంతలేసి పనుల కెత్తిన దీజంత
నోటిచేదు వాడము పాటివన్న '
పరులకెగ్గుసేయు పాపాత్మురాలిని
పట్టి విడువఁజనదు పార్థివునకు. 22

నావుడు రామచంద్రుఁడు మ
నంబునఁ గుత్స దలిర్ప నోర్పుమై
భావనసేసి తానెఱపు
పౌరుషపద్ధతి కోహటించి నే
ర్పావహిలంగఁబలుక- శర
ణాగతులన్ సతులన్ నృపాలకుం
డేవిధిఁ జంపనేర్చు వచి
యింపవె మౌనికులావతంసమా ? 23

అనవిని కౌశికుండిది య
థార్థమ చంపన గోరి వచ్చు వా
రిని గరుణింతురయ్య ! యెది
రిన్ గుఱుతించి మెలంగు వాఁడ పో
జనుఁడు మునీంద్రకంటకులు
జాల్మ లవశ్యము వధ్యులందునున్
రణమున వారు వీరని ప
రామరిసించుట యర్హకృత్యమే. 24

అదియునుంగాక 25

కోల్తలనేసి మాటికెల
గోలున వ్రాలు నికృష్టదానవిన్
గూల్తురు గాక నిన్ను వలెఁ గు
త్సవహింపరు తజ్ఞులన్నఁ దో
ర్దోల్తఁ జలించెఁగాని రఘు
ధూర్వహుఁ డొప్పరికించె నంతలోఁ
బోల్తక ఖోలుచుంబడియె
భూతల మొక్కట దద్దరిల్లఁగన్. 26

అప్పు డయ్యకాండకాండ ప్రయోగంబున కత్తిరిదండి కోదండ
పాణిం గొండాడు నెడ 27

తా నెక్కడించులోనన్
బాణము బెడిసెనని రామభద్రుఁడు వలుకన్
పోనీ దైవమ దీర్చెన్
దానవిదుశ్చేష్టలంచు దశరధుఁ డుబ్బెన్. 28

అంత నయ్యెల గోలుమూఁక లదురు బెదరు దక్కి రక్కసి
చుట్టు మూఁగి తద్బీకరాకారవికారప్రకారంబు లుగ్గడించు
కొని బెగ్గడిల్లుచుండ నద్దనుజాంగన పెనుగొండ వడువునం
బడి పుడమి వడంక మూల్గుచు నీల్గుచు దిక్కులద్రువ
నార్చుచుం బేర్చుచుఁ జూప అెడసిపో నణుముచు నుఱు

ముచు గండశిలలు పిండిగాఁ బొరలుచు నొఱలుచుఁ గుమ్మలుపోయి బొమ్మలువడి కాళ్లు విఱిగి వ్రేళ్లు దునిసి మొగము చదిసి మూఁపులు గదిసి కను గ్రుడ్లుదేల్చి వెను పట్టెవ్రాల్చి నెత్తుటం దోఁగి చెమట చిత్తడిం గ్రాఁగి నుర్వులు గ్రక్కుచు వెక్కుచు నసురుసురై యయ్యసుర యుసురు దొఱంగె. అంత గోసలేంద్రుండు స్కంధావారం బలవరించుకొని గాధేయాదులం దోడ్కొని సిద్ధాశ్రమంబు తెన్నువట్టి పయనంబు సాగించె. ఇక్కందువ యెఱింగి యింతకుమున్న రామానుజ తీవ్రాశుగంబునకు వెన్నిచ్చి మిన్నువట్టిన కరాళుండు తన ప్రభుండగు మారీచుండెం దడంగెనో యని యప్పొలికలను నల్వొలంకుల గాలించి యెందునుం గానక వేసరి వాయులీనుండై దక్షిణాపథంబు వట్టి పోవంబోవ నం దొక్కయెడఁ దాటకేయుని మణికిరీ టంబును, రత్నఖేటంబును, వజ్రకంకటంబును, నిశిత నిస్త్రింశంబునుం బొడఁగట్టె. వానిం గైకొని మత్ప్రభుండు రామసాయక గృహీతుండై యివ్వలను మెఱసి చనెను కా వగచి మనోజవంబు గడవ నెగసి మహేంద్రాచల సానుకూటంబునన్ వ్రాలి తత్ప్రాంతగంభీరసాగరకల్లోల మాలాలోలవిలోకనజాలంబు లట్టెట్టు పఱపుసమయంబున

డిండీర పంక్తులొడ్డిన తరంగశ్రేణి
చికుర సంతతులపైఁ జిమ్మరేఁగ

జలదరించిన తనూసందష్ట చేలంబు
నిట్ట నిల్విన నుప్పు నీరువడియ
కాంతిపాసిన యంగకవ్రాతమొండొండ
బాలపాండరముతోఁ బాదరింప
చివురుఁ గన్నులపాప లవిరి ముట్టినభంగి
జేగురు వన్నెతోఁ జికిలింప

తడిసి ముప్పంపుమై వలిదాఁకి యుదధి
వీచికలఁ ద్రోఁచివచ్చు మారీచుఁ జూచి
వరుణదేవత యనెడు విభ్రాంతి దొడరి
అడుగు పూనికఁ గరాళుఁ డయ్యెడకుఁబఱచె. 30

అంతట 31

మారీచుండు మహేంద్ర పర్వత నితం
బ ప్రాంతముం జేరి దు
ర్వారుండై పఱతెంచు వానిగని చే
రంజీరి యోయయ్య! నా
ప్రారబ్ధంబిటులయ్యెనంచు వగచెన్
బాహాపరీరంభణో
దారప్రేమరసప్రవాహ మది యం
తర్లీనమై పర్వఁగన్. 32

అంతఁ గరాళుఁ డెత్తి హృద
యమ్మున హత్తి యమోఘ బాణవి
క్రాంతికి నబ్ధిఁగూలి బ్రదు
కందరమే యొరు లేరికైన నీ
వెంత యదృష్ట శాలివో క
దే తుదకుం బులినోటికండ దా
నంతటఁ దానె యూడిపడె
నన్న నతం డతి విస్మయంబునన్. 33

మును స్వర్గంబును దాడివెట్టమె ! జయం
బుల్ క్రొత్తలే ? పాక శా
సను వజ్రస్ఫురణం బెఱుంగమె ? సురా
స్త్ర ప్రౌఢిమల్ సూడమే ?
వినమీనాఁటికి నారఘూద్వహు ధను
ర్విద్యా మహత్వంబుఁ ద
ద్ఘనబాణప్రసరప్రభావము నమో
ఘం బద్భుతం బింతకున్. 34

ఆతీవ్రాశుగపాతఝుంకృతు లమ
ర్త్యవ్రాతసంతోషవా
గ్గీతుల్ భేరులమ్రోఁత లబ్ధి బడబా
గ్నిప్రుష్టకల్లోలసం

ఘాతంబుల్ సెవిసోఁక నొక్క మొగి గ్రు
క్కం ద్రిప్పఁగోలేక పె
న్వాతోద్ధూత తనుండనై పడితి నీ
వారాశి మధ్యంబునన్. 35

ఆపాటిప్పటి కాత్మఁబాయదు కరా
ళా! సంధిబంధంబులం
దేపాటెన్ హృదయంబు చక్కఁబడ దా
హా నాత్మ బాణాహతిన్
పీపుంద్రెళ్ళి రసాతలంబు దనుకన్
వేవేగఁ జొత్తెంచిరా
రాపుల్మీఁలు తరంగ హస్తముల సం
ద్రంబెత్తి లాలింపఁగన్. 36

కడఁకఁదక్క కంర గతజీవనుండనై
భంగసంగతముగఁ బడితిఁ జెడితి
నన్ననతఁడు వల్కె నసురేంద్ర భయమున
సత్కరించెనేమొ? సాగరుండు. 37

అనుటయు మారీచుం డొక్కింత వగర్చి 38

అగుఁగా కా దశకంధరుం డనుచర
వ్యాసక్తుఁడయ్యున్ నను

న్నిగులంగాఁ జనవిచ్చి ప్రోచుటయు సు
మిత్రా ! సర్వలోకంబులన్
నగముల్, సాగరముల్, నిధుల్, నదులు, కా
నల్, కోనలున్ సర్వ భూ
త గణంబుల్ ననుగాంచి బెగ్గడిలు న
త్యాశ్చర్య ధుర్యంబుగన్. 39

అంతటి ప్రాపుగల్గి తుద
కైన గతిం దలపోయ దిక్కులే
నంత బలంగముండియు నొ
కప్పుడు నిష్ఫలమంచుఁ దోఁచు న
న్నెంతయు నాత్మనమ్మి యని
కెత్తిన చుట్టలఁ బ్రోవఁ జాలకీ
వంతునఁ జావుదక్కి తల
వంపు ఘటించితి దైత్యభర్తకున్. 40

అని మారీచుఁ డెదం బదింబదినమ
ర్షావేశదుఃఖంబులున్
దనుకంబలకఁ గరాళుఁ డొత్తి వలుకున్
దైత్యాన్వవాయాగ్రణీ !
నినుఁగాదందు రె ! దైవయోగమున కం
టెన్ గూర్చువారందు రే

చను నేత్వాదృశకర్మ పీరున కను
త్సాహంబు వాటింపఁగన్. 41

కావునఁ గడంక సెడక 42

ఆరాజన్య కుమారకుల్ గడప వ
న్నా ! దీని విన్నంత నే
తీఱున్ గాధిసుతుండు దాన మన యు
ద్దిష్టార్థ మాయాల మీ
డేఱున్ గాక యుపేక్ష సేయు నెడ మా
నీంద్రుండు దుర్మార్గుఁడై
ప్రారంభమ్ముల మాన్చి విఘ్నముల నా
పాదించు నశ్రాంతమున్. 43

అననేమో మది కెక్కెన
యనువున మారీచుఁ డతిరహస్యముగఁ గరా
ళుని చెవి గఱచిన నాతఁడు
మన మలర వచించు మాటి మాటికి నగుచున్. 44

ఈ యప్రియవార్తన్ విని
నా! యమ్మదిరాక్షి ద్రెళ్లు నాబిడమ్మృతికిన్
బ్రాణోపవేశగతుఁడై
పాయుం బ్రాణములు రామభద్రుం డంతన్. 45

పుత్రశోక భరార్తుఁడై భూధవుండు
మగిడి చనువేళ మౌనియు వగపు దీర్ప
వెంటఁబడిపోవు నిఁక నెల్ల వెంటలందుఁ
గర్జము ఫలించు మన దశకంధరునకు. 46

అదియుం గాక 47

పుత్రుని పోకకు బలవ
చ్ఛత్రుని వీఁకకుఁ దలంకి సమయు నతండున్
మిత్రుని మృతికిం జనకుని
పుత్రిక గతికిన్ నశించిపోవు నితండున్. 48

అని యొగుడు గదలు భంగిన్
వినువీథికి నెగసి దైత్యవీరులు చనుచున్
గనిరల్లంతట దశరథ
జనపతి విడిసిన రసాలసాల వనంబున్. 49

అపు డచ్చట నెంతయు 50

రవణించు శృంగారరజతాచలేంద్రంబు
పసపాడు నిద్దంపు భర్మశిఖరి
వినుదొట్టి గర్వించు వింధ్యావనీధ్రంబు
రుచిరసంగతిఁదేలు రోహణాద్రి

ప్రొద్దు నివాళించు పూర్వదిక్కుధరంబు
పొలుపొందు పశ్చిమ భూధరంబు
ఏప్రొద్దు వడఁదేరు హిమవన్నగోత్రంబు
తావుల వెదఁజల్లు దర్దురంబు
అగు నసంగతకల్పనాభ్యాసజన్మలు
పటకుటీరంబులని యచ్చుపడవచింత్రు
భూభృదుద్దామ పరిభవంబులు వచింప
మిన్ను ముట్టని కవిరాజు లున్నవారె! 51

పెళపెళగూలు మ్రాకులపొంత గజరాజు
కోలాట మాడెఁ బెన్గొమ్మ లాడిచి
జొంపంబు లుడ్డాడఁ జొత్తెంచు నుష్ట్రంబు
మల్లాడెఁ బూఁదీవ లొల్లగించి
అంచెలంచెల దువాళించు తురంగంబు
హేషించె బలుకంద మిమ్మడించి
రేవు పట్టున మోఁకరించు మహోక్షంబు
గోరాడెఁ దనగుబ్బ కొమ్ములొడ్డి
నట్టి తెగఁబిండెఁ గుండలు గిట్టుమనఁగ
బానసము గుమ్మ గుమ్మని పరిమళించెఁ
గంగుకంగురుమని కంచు గంటలులిసెఁ
దటపటని నింగిమోవఁ బతాక తెగసె. 52

మఱియు నందు 53

జుంటి పూఁదేనె తమిఁదీఱ జుఱ్ఱువారు
ఇంబడరఁ గొండవాఁగుల నీఁదువారు
ఉద్దవిడిఁ దీవ జొంపము లూఁగు వారు
అలబలమ్ముగఁ జెలరేఁగి రదవుమీఁటి. 54

అయ్యెడ రామభద్రుం డవ్వనగ్రహణకోలాహల మ్ముడిపి యధ్వపరిశ్రాంతుండగు తాత పాదు లెఱుంగకుండఁ దమ్ము గుఱ్ఱల కే నెఱుకపడనీక యేకాకియై శరశరాసనంబులం దాల్చి పెల్చన మృగయా వినోదార్థం బేతెంచువాఁడు 55

గవిదూరం బులి నేసి మార్గ్మలయు బు
త్తుత్రశ్రేణిఁ జక్కాడి దు
ష్టవనేభంబులఁ దూల్చి సింగముల నూ
టాడించి ధావన్మృగ
వ్యవసాయ మ్మణఁగించి సత్వభయద
వ్యాపార మేపార సై
రవిహారంబులఁ గ్రీడసల్పె భుజ ద
ర్పం బేర్పడన్నేర్పుగన్. 56

అంత 57

ఇమ్ములరోసియుఁ రఘుకు
లేంద్రునిగానక పింగళుండు సై

న్యమ్ముల హెచ్చరించి యొకఁ
డై చనె నేమగునో పదుం డిదే
నమ్ములఁ గొంచు వత్తునను
డచ్చటఁబొంచిన దైత్యు లాత్మలన్
సమ్మదమంది భావిఘట
నా నటనా జటి లాభిలాషులై. 58

తదాగమన మ్మొకక యంతర్లాభంబుగ భావించుకొని కొండొక వడి గుసగుసలాడి యథేచ్ఛం జని రంత దాశరథిశ రాఘాతంబులకు భీతంబులై తెఱలంబాఱు వారణంబులును, దన్నివారణ ధీరంబులై మాఱు పెనంగు కంఠీర వంబులును, వానిబారి సమరి వెఱచఱచు శరభంబులును, దద్రభసంబునకు విజృంభించి వేచను రేఁచులును, నింతిం తలై పుంతలం దాటి క్రంతలం దూటి కాలొత్తలందిఁ బాఱు సమయంబునఁ బ్రక్కదాట్లు గొను కడఁతు లెడ పడి విషమ విషాణ విఘట్టిత ద్రుమంబులై నెత్తురువఱ్ఱోడి మడుగులంబడి పడుగు పేఁకల వడువునఁ గ్రిందు మీఁదై క్రందడంగె. ఆరొద బెదరున నదరిపడి గ్రేళ్లుఱుకు లేళ్లు రేగళ్ళంబడి గొరిజల తాఁకునఁ గ్రమ్ము దుమ్మునం గలసి గగ్గనగోలుగ మింటఁబఱచె నకల్లోలంబున కెల్లడ భల్లుకంబులు చెల్లా చెదరై పుట్టలఁగొట్టుపడి ఱాలడీలు పడిపాదలనుదిలకొని ఘుకాకారవంబడరవడిచెడి నుడి

వడియె. అందందెడరు వేచివాచవులూర నాల్కలు గోడు కొండచిలువ లెదురెక్క సత్వంబుల గబళించి "విభాళించుడు" నేదు వెరిగి శలలంబులుడుల్చె. దూప్పి చప్పునఁగుప్పించె, మన్ను కొమ్మునం జిమ్మె, నెడగండు చిడిముడి వడియెఁ జిఱుతపైఁ బఱచె నొండికాఁడూడని బాడె నప్పదనున నానావిధ శకుంత సంతానంబు లుప్పరం బెగసి చట్టుప లార్చి పేర్చి రొదసేయఁ దొడంగె. అట్టి యెడ నించు కెడదవ్వ గలుగ 59

ఓయన్న ! దుష్టగజమిదె
నాయసువుల కెత్తె మన్మనః ప్రియమెసఁగన్
డాయవె, వ్రేయవె, సాయము
సేయవె యను నేడ్పు టెలుఁగు చెవి సోఁకంగన్. 60

రామభద్రుం డుదిలకొని 61

ఇదెచనుదెంతు నమ్మదపు
టేనుఁగు గీనుఁగు నుక్కడంతు నా
పదఁదలఁగింతు నోడకుము
భద్ర! బృహద్రథు లంగరక్షకుల్
విదిత శరవ్య లున్నపద
విన్ దలఁగందగ దట్టి జోదులె
ప్పదనున చుట్టివత్తురు వి
పద్దశ వాపుదు రోపినంతకున్. 62

అనుచుం గొండొకవడిం జని 63

ఈ తెరువు వట్టి చనెన
బ్భీతుంగొని గజము గానిపించెడు నిచ్చోఁ
బాతర గుంతల వడువున
లోఁతగు పెన్గాలి జాడలు న్వైరళములై. 64

అనుచుఁ బాలువోక వెనుకముం దనిలేక
చెట్టు చెట్టు గుట్ట గుట్ట నెమకి
చిట్ట చివర కతఁడు సిద్ధాశ్రమో పాంత
విపిన వీథులెల్ల వెదకఁ దొడఁగె. 65

అంతట నుర్వులు గ్రక్కుచు
గొంతుక గుట గుటన కళ్లెగ్రుక్కుచు వెలిక
త్యంతము వెక్కుచు లోలో
సంతసపడు వాని రామచంద్రుఁడు గనియెన్. 66

కని కరుణ దొలఁక డగ్గఱి
మనమురకనితాంత దుఃఖ మగ్నముగాఁగన్
దన చెఱఁగుపట్టి విసరుచు
దనువున్నవరించి కన్నుదమ్ములు తుడువన్. 67

కపటపింగళుండు కనుదమ్ము లరవిచ్చి
బ్రదికినాఁడ రామభద్ర! నేఁడు

ఇంత కింత వడియు నిట్టుంట నాతల్లి
కడుపుఁ జల్లదనము గాదఁటోయి! 68

ఎందువేటరారె ? యినవంశ సంభవు
లింత ఘోరకలి మఱెందుఁ గలదు
ఏటు దప్పిచన్నదిందొక్కఁ డున్నదే ?
దిగులు గూరకున్న దిక్కు గలదె ? 69

మిన్ను మన్నుఁ గలిపి మిత్తికి యాడితి
భూతకోటి కెల్ల భీతిగదుర
గ్రక్కతిల్లిపోయె గగన భాగంబెల్ల
గుబ్బటిల్లి పుడమి గోడుగుడిచె. 70

కన్ను తెఱవనీదు కంఠమ్ము సరికాదు
కాలుసాఁగి పోదు కేలురాదు
ఊపిరాడలేదు భూపాలపుత్రకా!
తెరలి మృగము లఱచి పఱచువేళ. 71

అపుడు 72

ఎందుండి వచ్చిరో మృగ
ముం దఱుముచు గజమొకండు ముచ్చిరు నన్నున్
గ్రిందుపడ నీడ్చి నెత్తురు
చిందం గొంపోవుచుండ సింగం బవలన్. 73

గర్జించె నూర్జితంబుగ
స్ఫూర్జథు వట్లడరి దానశుండాలము నన్
వర్జించి పఱవ భీకర
గర్జనమున మూర్ఛ మునిఁగి కడకిటులైతిన్. 74

అని పవమాన మానహార
మై వనవీథినిదాఘదీధితుల్
దనుక వగర్చినన్ దశర
థక్షితిపాల తనూజుఁ డాతనిన్
వెనుకొని మెల్లమెల్ల నడి
పించె వినీలతమాలతాలచం
దనతరుమండలాంతరని
తాంతలతావలయైకసీమకున్. 75

ఇంతలో మధ్యాహ్నంబగుటయు 76

సప్తాశ్వసంరంభశమనోద్ధృతభుజాగ్ర
ఘటితకరకశకశాఘాతములకు
సారథివికలాంగసంధిబంధవ్యథా
ప్రకటితదీనసంభాషణలకు
భుజగరశ్మిచ్ఛటాపూతాకరధూమాంధ
కారబంధురరథోత్కమణములకు
శ్రాంతతురంగమోచ్ఛ్వాసానిలోద్ధూత
పార్శ్వగ్రహానేక ప్రార్థనలకు

నీలగగనాబ్ధిజలదకల్లోలపటల
ఘుంఘుమస్నిగ్ధగంభీర ఘోషణలకు
మండిపడి చండమార్తండమండలంబు
గ్రుక్కద్రిప్పక నిప్పుకల్ గ్రక్కఁ దొడఁగె. 77

ఆ పుణ్యాశ్రమ దివ్యభూము లపు డా
హ్వానించి న ట్లిర్వురున్
దాపించచ్ఛవి వొల్చు కుంజముల మ
ధ్యం గొంత ప్రొ ద్దుండి సం
తాపం బించుక వాయ 'మాయ'గజవృ
త్తాంతంబు వోనాడి స
ల్లాపవ్యాపృతి నల్లనల్లఁ జని రు
ల్లాసంబు సంధిల్లఁగన్. 78



| | | | |
|---|---|---|---|
| క్షేత్రలక్ష్మి | 1 | 0 | 0 |
| ప్రేమాలోకము | 1 | 0 | 0 |
| మగువమాంచాల | 1 | 8 | 0 |
| రైతు (హరికథ) | 0 | 8 | 0 |
| సూక్తిసుధ | 0 | 6 | 0 |
| సిద్ధాశ్రమము | 1 | 0 | 0 |

రాఁబోవు గ్రంథము—

నాయకురాలు


ఏటుకూరి వేంకట నరసయ్య,

తెలుఁగుపండితుఁడు, ఎడ్వర్డు బోర్డు హైస్కూలు,

నిడుబ్రోలు :: బాపట్ల తాలూకా.